# పాకిస్థాన్

## జాతుల స్వయం నిర్ణయ హక్కు



కామ్రేడ్
జి. అధికారి



ప్రజాశక్తి కార్యాలయం
:: బెజవాడ ::

ప్రజాశక్తి ప్రచురణ ౧౨ జనవరి 1943

# విషయం



ఆరణాలు పాప్యులర్ ప్రింటర్స్, బెజవాడ

I

# అను బంధం

కొన్ని యింగ్లీషు మాటలు తెలుగులో యీక్రిందివిధంగా తర్జుమా చేయబడ్డాయి:—

| ఇంగ్లీషు | తెలుగు |
|---|---|
| Autonomous State Existence | ప్రత్యేక రాజ్యాంగ పరిపాలనా హక్కు |
| Communal Unity | మత సామరస్యం |
| Communal tension | మత వైషమ్యాలు |
| Communal problem | మత సమస్య; సాంఘిక సమస్య |
| Communal patriotism | మతాభిమానం |
| Communal Leaders | మత నాయకులు |
| Communal Electorates | మత ప్రాతినిధ్యం |
| Communal riots | మత కలహాలు |
| Home - Land | జన్మ భూమి |
| Horizontal Development | అడ్డంగా పెరుగుట |
| Joint Electorates | సమిష్టి ప్రాతినిధ్యం |
| Multi-national State | వేర్వేరు జాతుల సమ్మేళనం |
| Oppressed Community | అణచబడ్డ సంఘం |
| Provincial Jealousies | రాష్ట్ర దురభిమానం |
| Pan - Islamic Theory | 'ముస్లిం దేశాలన్నీ ఒకటి' అనే వివాదం |
| Race | మానవజాతి |
| Right of self - determination | స్వయం నిర్ణయ హక్కు |
| Separate State | ప్రత్యేక రాజ్యాంగం |
| Vertical Development | నిలువుగా పెరుగుట |

• • • •

[illegible] వ పేజీ చివర పంక్తిలో యిలా వుంది : "ఈ అభివృద్ధి (పారిశ్రామికాభివృద్ధి) యొక్క దశ మామూలుగానే వుంది"—11 వ పేజీ 11 వ పంక్తిలో "ఆర్థిక నిర్మాణం దేశం అంతటా సమాన దశలలో వృద్ధిచెందదు." అనివుంది. 27 వ పేజీ 23 వ పంక్తిలో యిలా వుంది : "ఈఅభివృద్ధి అన్ని పరిశ్రమలలోను గాక, యే కొద్ది పరిశ్రమలు స్థాపించబడ్డాయో వాటిలోనే ఎక్కువగా కనబడుతుంది. దీనినే పరిశ్రమలు నిలువుగా కాక, అడ్డంగా పెరుగుట, అంటాము."

ఉదాహరణకు : ఇంగ్లండ్, అమెరికా, వంటి దేశాలపై విదేశీ పెట్టుబడిదారుల పెత్తనం లేకపోవడంవల్ల ఆ యా దేశాలలో అనేక ప్రధాన పరిశ్రమలు విరివిగా స్థాపించబడి, ప్రతి పరిశ్రమ ఎంతవరకు అభివృద్ధిచెందగలదో (పెట్టుబడిదారీ విధానపు హద్దులలో) అంతవరకు అభివృద్ధిచెందడానికవకాశంవుంది. దీనినే పరిశ్రమలు నిలువుగాపెరగడం అంటాం కాని, మన దేశంలో విదేశీ పెట్టుబడిదారుల పెత్తనం (ప్రధానంగా బ్రిటన్) ఉండడంవల్ల, తమకు ఎక్కువ నష్టంరాని పద్ధతిలో మాత్రమే దేశీయ పరిశ్రమల అభివృద్ధికి అవకాశం ఉంది. పారిశ్రామికాభివృద్ధికి ప్రధానం కాని కొద్ది పరిశ్రమలు (ఉదా: బట్టల పరిశ్రమ, పంచదార పరిశ్రమ) దేశంలో నలుమూలల వ్యాపించాయి. ఓడలపరిశ్రమ, ఉక్కుపరిశ్రమ మోటారు-విమాన పరిశ్రమలు మొదలైన ప్రధాన పరిశ్రమలకు ఎన్నో ఆటంకాలు కల్పించబడ్డాయి కాబట్టి, అవి వృద్ధిచెందడాని కవకాశంలేదు. దీనినే పరిశ్రమలు అడ్డంగా పెరుగుట అంటాము.

18 వ పేజీ 17 వ పంక్తిలో యిలా వుంది: "భావి భారతదేశంలో వేర్వేరు జాతుల స్వతంత్ర రాజ్యాలు కలిసి, అటానమస్ స్టేట్సు యొక్క యూనియన్ లేక ఫెడరేషన్‌గా పరిపాలించబడుతుంది." 19 వ పేజీ 8 పంక్తిలో యిలా వుంది: "అక్కడి (బెంగాల్‌లో తూర్పు, ఉత్తర, జిల్లాలలో) బెంగాల్ రాజ్యాంగ పరిపాలనలో ముస్లింలు తామొక స్వతంత్ర ప్రదేశాన్ని కలిగియుండవచ్చు; లేదా అందులోనే ఒక భాగంగా అటానమస్ రీజియన్‌ను స్థాపించుకొనవచ్చు."

'అటానమస్ స్టేట్' అంటే అర్థం, అచ్చటి ప్రజలకు ప్రత్యేక రాజ్యాంగాధికారం, విడిపోయే హక్కు, వుంటాయి. కాని, 'అటానమస్ రీజియన్'కు యీ రెండు హక్కులు ఉండవు. కాని, అచ్చటి ప్రజలకు మతం, భాష, విజ్ఞానం, సాంప్రదాయాలు, మొదలైన వాటి అభివృద్ధికి పూర్తియైన రక్షణలు శాసనరీత్యా కల్పించబడుతాయి.

• • • •

పాఠకులు ఈ క్రింది సవరణలను గుర్తించి, సరిచేసుకొనగోరుతున్నాం:—

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 5 | ప్రభుత్వానికి | ఈ మాట అనవసరం |
| 18 | 17 | ఒక | ఈ మాట అనవసరం |
| 24 | 13 | 1906-1916 | 1906-1918 అని వుండాలి |
| 40 | 13 | మెన్షివిక్కులు | ఈ మాటకు ముందు (2) అంకె ఉండాలి. |

27382 III

# పాకిస్థాన్ :

# జాతుల స్వయం నిర్ణయ హక్కు

"ఆయన (జిన్నా) అభిప్రాయములో పాకిస్థాన్‌యొక్క సారాంశం, భారతదేశాన్నుంచి ఒక భాగాన్ని విడదీసి, దాన్ని స్వతంత్రరాజ్యంగాను, సర్వ హక్కులూ గలిగిన ప్రభుత్వంగాను, పరిగణించాలి అనే కోరిక....

"పై నిర్వచనం కలిగిన పాకిస్థాన్ ఆయన దృష్టిలో ఒక మతసిద్ధాంతం. అయితే భారతదేశాన్ని ఏవిధంగాను విభజించరాదు, అనేదికూడా నా దృష్టిలో ఒక మతసిద్ధాంతమే. ఇందువల్లనే దేశంలో నిస్తబ్ధత యేర్పడింది"

26-7-42 తేదీ "హరిజన్"లో గాంధీజీ.

"ఏదో ఒక పెద్ద ఉద్యమం రాబోతూందని నేను వింటున్నాను. ఈ బెదరింపు, ఈ భయపెట్టడం, యొక్క ఉద్దేశ్యం ఏమంటే, చిక్కుపరిస్థితులలో శిధిలమైయున్న బ్రిటన్‌ను నిర్బంధపరచి, గాంధీజీయొక్క కోర్కెను అంగీకరించేటట్లు చేయడం. నేనుచెప్పేది ఏమంటే, మహమ్మదీయుల హక్కులకు వినాశనం కలిగించే విధంగా బ్రిటను కాంగ్రెసుకు లొంగిపోయేటట్లయితే, అదొక పెద్ద పొరబాటు చేస్తూన్నదన్నమాట."

22-6-42 న జిన్నా చేసిన ప్రకటన.

## హిందూ - ముస్లిం ఐక్యతలో చిక్కు పరిస్థితి

పై రెండు అభిప్రాయాలు, మనదేశపు పెద్దపార్టీలైన భారత కాంగ్రెసు, ముస్లింలీగుల నాయకులు వెల్లడించిన అభిప్రాయాలు. జాతీయ ఐక్యత అనే సమస్యలో యేర్పడినచిక్కు పై అభిప్రాయాలలో నిబిడీకృతమైయుంది. ఇంతవరకూ మన స్వాతంత్ర్యపోరాటంలో, జాతీయైక్యత లేనిదే, ప్రజాసామాన్యపు—అనగా హిందువులయొక్క, ముస్లిములయొక్క—విశాల ఐక్యత లేనిదే, స్వాతంత్ర్యాన్ని సాధింపజాలము అనేది ఎల్లప్పుడూ ఒకమూల సిద్ధాంతముగా ఉంటూ వచ్చింది. జర్మనీ జపాను దురాక్రమణదారులు మన మాతృదేశంపై దుమకడానికి సన్నాహాలుచేసే యీనాడు, జాతీయైక్యతయొక్క ప్రాముఖ్యత మరింత హెచ్చింది. భారతదేశ మంతటా ప్రజలు యీ దండయాత్రను ఎదుర్కోవడానికి ప్రజాసమీ

కరణ అవసరం. ఇందుకు జాతీయైక్యత కావాలి. ఇంతేకాదు. జాతీయప్రభుత్వాన్ని లాక్కోవడానికి కూడా జాతీయైక్యత కావాలి. ప్రజలందరి విశ్వాసాన్ని చూరగొన్న జాతీయ ప్రభుత్వం ఉంటేనే ఫాసిస్టుదాడిని జయప్రదంగా ఎదుర్కోగలం. మన దేశాన్ని మనం జయప్రదంగా రక్షించుకోవడానికి కావలసిన అధికారం జాతీయప్రభుత్వానికే ఉంటుంది. ఈ యదార్థం సర్వాంగీకారమైనది. దేశ స్వాతంత్ర్యానికి పోరాటం ప్రారంభించాలంటే, మొట్ట మొదట కావలసింది ఐక్యత. ఈ యదార్థం సామ్రాజ్యవాదులకుకూడా తెలుసు. అందువల్లనే వారు ఆ ఐక్యతను భగ్నపరచడానికి నిరంతరం కృషిచేస్తూ వచ్చారు అందువల్లనే ఒక మతప్రజలకూ, మరొక మతప్రజలకూ, మధ్య అవిశ్వాసాన్ని పెంపొందింపజేస్తూ వచ్చారు. అయితే దీని అర్థం, సామ్రాజ్యవాద పరిపాలన అంతమొందితేగాని ఐక్యత సాధ్యంకాదని చెప్పామా ? ఎన్నటికీ మనం అలా చెప్పలేదు అవిధంగా చెపితే, స్వాతంత్ర్యమే సాధ్యం కాదని చెప్పడం అన్నమాట. సామ్రాజ్య పరిపాలన ఉన్నప్పటికీ, మనం ఐక్యతను సమకూర్చగలం. సమకూర్చాలి. ఎందుకు ? మనదేశాన్ని మనం రక్షించుకొనే నిమిత్తం. జాతీయప్రభుత్వాన్ని లాగుకొనేనిమిత్తం. అయితే ఈరోజున మన జాతీయనాయకులు ఈ యదార్థాన్ని ఒప్పుకోవడంలేదు. చిక్కుపరిస్థితు లేర్పడటానికి మూలకారణం యిదే. దీని అర్థం, మన జాతీయనాయకులు సామ్రాజ్యవాద నిరంకుశత్వము యెదుట ఓటమిని అంగీకరించారన్నమాట. చీలికలు పెట్టే విధానం యెదుట మాప్రజలను మేము ఏకం చేయడానికి శక్తిలేదని సామ్రాజ్యవాదంయెదుట అంగీకరిస్తున్నారన్నమాట. ఇది దివాలాతీసే పంథా అని ఒప్పుకోవడం. ప్రజలలోను, ప్రజల దేశభక్తిలోను, విశ్వాసం ఏమాత్రమూ లేకపోవడం అన్నమాట.

## దివాలాకు దారితీసే విధానం

ఒకనాడు గాంధీజీదృష్టిలో, మతసామరస్యం నాలుగు స్వరాజ్య సోపానాలలో ఒకటిగా ఉండేది. కాని, ఈరోజు ఆయన మూడోపార్టీని తొలగించిన తరవాతనే మత సామరస్యం వస్తుందని అంటున్నాడు. "స్వాతంత్ర్యానికి ముందు ఐక్యతరాదు. తరవాతనే వస్తుంది" (హరిజనపత్రిక 7-6-42) వార్ధాతీర్మానంలోకూడా ఈ క్రిందిఅభిప్రాయం వెల్లడిచబడింది:-

"సాంఘిక సమస్యను పరిష్కరించడానికి కాంగ్రెసుప్రతినిధులు తమ యావచ్ఛక్తినీ వినియోగించారు. కాని, విదేశీ పరిపాలకులు దేశంలో ఉండడంవల్ల పరిష్కారం సాధ్యము కాలేదు. విదేశీ పరిపాలకులు దేశాన్ని విభజించి పరిపాలించే నీతిని చిరకాలమునుంచీ, ఎడతెగకుండా, ప్రయోగిస్తున్నారు."

మన ప్రజలను విభజించి పరిపాలించే సామ్రాజ్యవాదవిధానాన్ని ఎదుర్కోజాలకపోతే, మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించలేమనుమాట స్పష్టం. దివాలా లక్షణం

గల అట్టి అభిప్రాయంమీద ఆధారపడి పనిచేసే విధానం దివాలాకు దారితీసే విధానమే. వార్ధా తీర్మానంలో వివరించబడిన పంథా యిట్టిదే. ఎందువల్లనంటే, మొదట స్వాతంత్ర్యాన్ని ప్రసాదించవలసిందనీ; తరవాత మేమందరమూ ఐక్యమవుతాం అనీ; అప్పుడు జాతీయ ప్రభుత్వం స్థాపించి మాదేశాన్ని, ప్రపంచ ప్రజాతంత్రవిధానాన్ని, మిత్రరాజ్యాలతో కలిసి రక్షించుతామనీ; ప్రాధేయపడ్డం అన్నమాట. ఈ కోర్కెను బ్రిటిషుప్రభుత్వం ప్రసాదించకపోతే, నాయకులు "పోరాటా"న్ని లేవదీయాలంటున్నారు.

నేటి పరిస్థితులలో పోరాటం అంటే, ఆత్మహత్య అన్నమాట. బ్రిటిషుప్రభుత్వం మన దేశంనుంచి వెళ్ళిపోయేవరకు మత సామరస్యం సాధ్యపడదనే దివాలా విధానమే దీని కంతటికీ కారణం.

## ఇటీవల మత వైషమ్యాల అభివృద్ధి

షుమారు 20 సంవత్సరాలనుంచీ భారతదేశంలో అత్యధికమైన జాతీయైక్యతను సాధించగలిగిన జాతీయోద్యమపు నాయకులు యీరోజున ఎందుకు హిందూముస్లిం ఐక్యత విషయంలో ఇంత నిస్సహాయంగా ఉన్నారు? "భారతదేశాన్ని విభజింపకూడ"దని గాంధీజీ, పాకిస్థాన్ తనకు మత సిద్ధాంతం అని జిన్నా, బిగించుకొని కూచుంటూ, ప్రజలలో అగాధమైన అనైక్యతను ఏర్పరచడానికి కారణం ఏమిటి? భారత జాతీయకాంగ్రెసు దేశంయొక్క సంపూర్ణస్వాతంత్ర్యముకొరకు, దేశీయుల ప్రజాతంత్రహక్కులకొరకు ఎడతెగకుండా కృషి చేస్తూ వచ్చింది; కృషిచేస్తూంది. కాంగ్రెసుయొక్క దృక్పథం ప్రకారం, స్వతంత్ర భారత దేశంలో మత స్వాతంత్ర్యము, ప్రజల యందలి ప్రతి ముఠాకు ప్రత్యేక విజ్ఞాన రక్షణ, ఉంటాయి. స్వాతంత్ర్యాన్నీ ప్రజా తంత్ర హక్కులనీ, కాపాడుతూ, విభజింపబడకుండా ఏకమైయుండే భారత దేశాన్ని నడుపగల కాంగ్రెసు కార్యక్రమం ఎందువల్ల మహమ్మదీయుల్ని ఆకర్షించడంలేదు? హిందువుల్నీ, మహమ్మదీయుల్నీ, ఇన్ని సంవత్సరాలు ఒకే తాడుమీద నడిపించగల్గుతూ, అందరికీ కావలసిన స్వాతంత్ర్యముకొరకై పోరు సల్పుతూ వచ్చిన కాంగ్రెసు, ఇటీవల ఎందుకు యీ సమస్యను పరిష్కరించలేక పోతూంది? 1935 మొదలు 1940 వరకు సాగిన ప్రజా సామాన్యపు జాతీయోద్యమంలో ముస్లిం ప్రజలుకూడా వచ్చారు. కాని, చైతన్యం పొందిన ముస్లిం ప్రజా సామాన్యం, ముఖ్యంగా కాంగ్రెసు మంత్రిత్వపు రోజులలో, ఎందువల్ల ముస్లింలీగ్‌తో చేరిపోయి, దాన్నంత బలీయమైన ముస్లిం సంస్థగా చేశారు? ఈ కాలంలో (కాంగ్రెసు మంత్రి పదవులు) హిందూ-ముస్లిం వైషమ్యాలు ఎందుకు ఎక్కువ కావడం ప్రారంభమయాయి? ముస్లిం ప్రజలకూ, జాతీయోద్యమానికీ మధ్య చీలిక అంతకంతకు ఎక్కువై, చివరకు మార్చి 1940 లో ముస్లింలీగు యొక్క పాకిస్థాన్ తీర్మానం వరకూ వ్యాపించడానికి కారణం ఏమిటి? ఇదే కాలంలో

హిందూ మహాసభ యొక్క ప్రభావంకూడా కాంగ్రెసులో హెచ్చింది. ఈ 5 సంవత్సరాల కాలంలో మత సమస్యయొక్క స్వభావాన్ని మనం అర్థం చేసుకుంటేనేగాని జాతీయ నాయకులు దానిని ఎందుకు పరిష్కరించ లేకపోయారో తెలుసుకోలేము. అలా పరిష్కరించజాలనందున జాతీయ స్వాతంత్ర్యం కొరకు జాతీయ ఐక్యత అనే ప్రధాన సూత్రం ఎందుకు నేడు తలక్రిందుచేయబడిందో తెలుసుకోలేము.

## నూతన దశలో మత సమస్య: రెండు ధోరణులు.

1937 తరువాత మత వైషమ్యాలు ఎక్కువ కావడానికి కారణం ఏమిటి? హిందూ ముస్లిం తగాదాలు ఎక్కువ కావడంతోబాటు, యీ కాలంలో రాష్ట్ర దురభిమానాలూ, రాష్ట్ర కలహాలూ, కూడా బయల్దేరాయి. ఉదాహరణకు, బెంగాల్, బీహార్ తగాదా; ప్రత్యేకాంధ్ర రాష్ట్ర సమస్య, సంయుక్త కర్ణాటక ప్రశ్న. ఈ వేర్వేరు మతస్థులయొక్క, రాష్ట్రాల యొక్క, పెట్టుబడిదారీ వర్గాలలో పోటీ యెక్కువై, వైషమ్యాలకు దారితీసిందనీ, ఉద్యోగాల కొరకూ-అధికారం కొరకూ సాగించబడిన యీ పోటీ నూతన రాజ్యాంగ విధానం (1935) వల్ల పైకి తీసుకురాబడిందనీ, కారణంగా చెప్పబడుతోంది. ఇందులో యదార్థం ఉన్నప్పటికీ, యిదొకటే యదార్థంకాదు. ఇది సమస్యయొక్క మొదటి భాగం. మత వైషమ్యాలుగాని, రాష్ట్రాభిమానాలుగాని, ప్రజా సామాన్యంలో ఉండవని తరచు వింటూ ఉంటాము. ప్రపంచం అంతటిలోను, దేశం మొత్తంమీద, కష్టజీవులందరి కోర్కెలు ఒకే రకంగా ఉన్నట్టయితే, పై విషయం నిజమే. కాని, నిత్య జీవితంలో పరిస్థితులు వేరుగా ఉంటాయి. సామ్రాజ్య వ్యతిరేక జాతీయోద్యమం ప్రజాసామాన్యంలో అంతకంతకు తీవ్రంగా వ్యాపించినట్లయితే, ఆ దేశభక్తి మతాభిమానంలోను, రాష్ట్రాభిమానంలోను ప్రతిధ్వనించుతుంది. ఐతే, అట్టి ఉద్యమాలు విశాలమైన జాతీయోద్యమాన్ని (సామ్రాజ్య వ్యతిరేక) సాధారణంగా బలహీన పరచకపోయినప్పటికీ, పెట్టుబడిదారీ నాయకత్వం వాటిని జాతీయ అనైక్యతకు తరచు వినియోగించు కుంటుంది.

కాబట్టి ఎన్నికల రోజుల్లోను, కాంగ్రెసు మంత్రిత్వాల రోజుల్లోను, ఎక్కువ అవుతూ వచ్చిన మత వైషమ్యాలు (హిందూ - ముస్లిం), రాష్ట్రీయాభిమానాలు, వక్రమార్గంలో నడిపించబడిన ఆవేశాలు. సరియైన నాయకత్వం ఉంటే, ప్రతిజాతికి చెందిన ప్రజలు, దేశం అన్నిమూలలలోను, బ్రహ్మాండమైన సామ్రాజ్యవ్యతిరేక జాతీయోద్యమంలో పాల్గొనియుండేవారు. ఈ రెండుధోరణులనూ ఇంకా జాగ్రత్తగా పరిశీలిద్దాం.

## పెట్టుబడిదారీ వర్గంలో పోటీలు

మొదటివిషయం:- సామ్రాజ్యవాదుల ఆటంకాలు ఎన్ని వున్నప్పటికీ, పెట్టుబడిదారీ వర్గపు పారిశ్రామికాభివృద్ధి అంతకంతకు ఎక్కువ ఔతూనేవుంది. ఈ అభివృద్ధియొక్క దశ

మామూలుగానే వుంది, దేశం అన్నిమూలలకుమాత్రం వ్యాపించుతోంది. (కాని, ఇంగ్లండు, అమెరికావంటి పారిశ్రామిక దేశాలలో అభివృద్ధియొక్క దశ నానాటికి ఉన్నతస్థాయికి వెళు తోంది) ఇందువల్ల ఫలితం ఏమంటే, దేశంలో ఉన్న వేర్వేరు జాతుల (Nationalities) పెట్టుబడిదారీవర్గం పోటీలు పడుతోంది. నూతన రాజ్యాంగవిధానం (1935) ప్రకారం యివ్వబడిన రాష్ట్రీయ స్వపరిపాలన యీ తగాదాలను ఎక్కువ చేసింది కాబట్టి ఈ యుగంలో బెంగాల్ - బీహార్ సమస్య, మహారాష్ట్ర - కర్ణాటకసమస్య, ఆంధ్ర - తమిళ సమస్య, బెంగాల్ యు. పి. పంజాబులలో హిందూ - ముస్లిం సమస్యలు, బయల్దేరాయి.

ఇది సమస్యయొక్క మొకటి లక్షణం. బూర్జువా లక్షణం. ఇది ఐక్యతలో చీలి కలు కలిగిస్తుంది. దీనినే సామ్రాజ్యవాదులు, వారి ఏజంట్లు, విభజించి పరిపాలించే తమ విధానానికి ఉపయోగించుకుంటారు. సమస్యను సృష్టించేదీ యిదే. సమస్యను యదార్థ రూపంలో కాకుండా వక్రరూపంలో చూపించేది యిదే.

## జాతీయలక్షణం

ఇక రెండోలక్షణానికి వద్దాం. ఇది దేశాన్ని అభివృద్ధి మార్గానికి తీసుకెళ్ళే లక్షణం. ఒకవైపు దేశంలో పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందుతూంటే, మరోవైపున దేశం అన్నిమూలల సామ్రాజ్య వ్యతిరేక జాతీయోద్యమం వ్యాపించుతూంది. బాగా వెనుకబడియున్న మతాలలోని, జాతులలోని, రైతుల సందరినీ ఈ ఉద్యమం ఆలుము కొంటూంది. దేశ స్వాతంత్ర్యానికై అన్ని ప్రాంతాలలోను వ్యాపిస్తూన్న జాతీయోద్యమం ఎంతో చక్కని స్వరూపంతో వృద్ధిచెందుతూంది. వేర్వేరు ప్రత్యేక జాతుల ప్రజలు యీ ఉద్యమంలో పాల్గొంటున్నారు. ప్రజలందరికీ గమ్యస్థానమైన భారత రాజకీయ, ఆర్థిక, స్వాతంత్ర్యము వేర్వేరు జాతుల ప్రజలలో కలుగుతూన్న చైతన్యం ద్వారా ప్రకటితమౌ తోంది ఉదాహరణకు, కర్ణాటకమందలి లింగాయత్ రైతాంగము సామ్రాజ్య వ్యతిరేక చైతన్యంతో నిండి యుంది. స్వతంత్ర భారత దేశంలో స్వతంత్ర కర్ణాటక జాతికై వీరు ఉవ్విళ్లూరుతున్నారు. ఇదే విధంగా, ఆంధ్రులు, తమిళులు, సింధు రాష్ట్రీయులు, పంజాబీలు, పఠానులు. మతవైషమ్యాలు, రాష్ట్రీయ దురభిమానాలు, వృద్ధిచెందడంలో పై ఉదాహరణలు అభివృద్ధి దాయకమైన లక్షణాన్ని వెల్లడిచేస్తాయి. ఈ లక్షణాన్ని మన జాతీయ ప్రజా స్వాతంత్రోద్యమమే ముందుకు తీసుకు వచ్చింది కొత్త రూపంతో బయల్దే రిన మత కలహాల సమస్యను పరిష్కరించడంలో యిదే మనకు తోడ్పడుతుంది. దీన్ని మన జాతీయోద్యమం గమనించి పరిశీలించవలసియుంది.

## ముస్లింలీగ్ నాయకత్వం - దాని స్వభావం

అయితే కొంతమంది యిలా ప్రశ్నించవచ్చు:-ఒక వైపు రాష్ట్రీయ దురభిమానాలు, మరోవైపున వేర్వేరు జాతుల ప్రజలలో సామ్రాజ్య వ్యతిరేక చైతన్యము, బయల్దేరడాని

కిన్నీ, హిందూ - ముస్లిం సమస్యకున్నూ, సంబంధం ఏమిటి ? రెండు మతాలలోను గల పెట్టుబడిదారీవర్గం ఆర్థికంగాను, యితరవిధాలుగాను, పోటీపడ్డం వల్లనేకదా. హిందూ ముస్లిం కలహాలు బయల్దేరుతున్నాయి ? సామ్రాజ్యవాదులు వీటిని ఉపయోగించుకొంటూ ప్రజా సామాన్యంలో జయప్రదంగా చీలికలు కలిగిస్తున్నారుకాదా ? ముస్లిం ప్రజాసామాన్యము పూర్వంకంటె ఎక్కువగా ముస్లింలీగును అనుసరిస్తున్నదంటే, అందుకు కారణం వారి జాతీయోత్సాహం కానేకాదే! విశాల భారతదేశదృక్పథంతో చూచినా, సంకుచితమైన ప్రత్యేక జాతులదృక్పథంతో చూచినా, వారిలోజాతీయచైతన్యం వృద్ధికావడంవల్లనేనా, ముస్లింలీగ్‌ను వారుఅనుసరించడం? అభివృద్ధినిరోధకమైన మత వైషమ్యవీకాలప్రభావం వారిలో వ్యాపించిడం వల్లనేకాదా ముస్లింప్రజలు ఎక్కువగా ముస్లింలీగ్‌ను అనుసరిస్తున్నది ? అట్టి ప్రభావా నికి కారణం, రాజకీయచైతన్యం విషయములో వారు వెనుకబడి యుండడమేకాదా ? పై విధంగా ఆలోచించడం, యదార్థపరిస్థితులను చూడకపోవడం అవుతుంది.

ఈప్రశ్నకు అర్థం, 1936-42 లలో దేశీయులందరిలోను బయల్దేరిన సామ్రాజ్య వ్యతి రేకోద్యమంయొక్క ప్రభావం ముస్లిం ప్రజాసామాన్యంలో లేదని భావించడం అన్నమాట. ఆ కాలంలో ముస్లింలీగ్‌యొక్క సామ్రాజ్యానుకూల, అభివృద్ధినిరోధక నాయకత్వంయొక్క ప్రభావమేముస్లింప్రజలలో ఎక్కువయిందన్నమాట. కాని,యదార్థం ఇదికాదు. దేశంఅన్ని మూలల బయల్దేరిన సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమంలో ముస్లింలు కూడా యెక్కువగా పాల్గొన్నారు. అయితే, అదేసమయములో ముస్లిం పెటీబూర్జువా (మధ్యతరగతి) ప్రజా సామాన్యంలో అధికసంఖ్యాకులు ముస్లింలీగ్ పలుకుబడికిందికి పోయారు. కాంగ్రెసును అనుసరించే ముస్లిముల సంఖ్య కూడా ఎక్కువ అయింది. కాని ముస్లింలీగ్ అనుచరుల సంఖ్యతో సమానంగా యెక్కువకాలేదు. ముస్లింప్రజలలో రేకెత్తిన సామ్రాజ్య వ్యతిరేక భావాల ప్రభావం ముస్లిమ్‌లీగ్ నాయకత్వంపై బాగా కనపడింది. భారతదేశపు సంపూర్ణ స్వాతంత్ర్యం తన ఆదర్శం అని 1938 లో ముస్లింలీగ్ అంగీకరించింది.

ఈకాలంలో ముస్లింలీగ్ నాయకత్వం మార్పుచెందిందని చెప్పవచ్చు. మధ్యయుగాలనాటి ఫ్యూడల్ అభివృద్ధి నిరోధక శక్తులకు ప్రాతినిధ్యం వహించ డము మానుకుంది. సామ్రాజ్యవాదుల చేతులలో వట్టి కీలుబొమ్మగా ఉపయోగ పడే పాత్రకు ముస్లింలీగ్ స్వస్తిజెప్పింది. నేడు ముస్లింలీగ్ నాయకత్వం ముస్లిం పారిశ్రామిక పెట్టుబడిదారీ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తోంది.

లీగ్ నాయకత్వం సామ్రాజ్య వాదానికి దాసోహంచేసే పంథాను విడిచి పెట్టి దాన్ని వ్యతిరేకించే పంథాను చేబట్టింది.

# ముస్లింలీగుకు ప్రజలలోగల పలుకుబడికి కారణం

భారత ప్రజాసామాన్యానికి కాంగ్రెసు సంస్థ ఎలాగో, ముస్లిం మధ్యతరగతి ప్రజలకు ముస్లింలీగ్ అలాంటిది. యుద్ధం యొక్క సామ్రాజ్యవాదదశలో యిది స్పష్టమయింది. ఆ దశలో, కాంగ్రెసు నాయకత్వం యుద్ధాన్ని వ్యతిరేకించుతూ, యుద్ధవ్యతిరేకమైన ప్రత్యక్ష పోరాట కార్యక్రమం ఏదీ యివ్వలేదు. దేశంయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గుర్తించవలసిందనీ, దేశ పరిపాలనలో ప్రభుత్వానికి తగిన అధికారం వెంటనే యివ్వవలసిందనీ, సామ్రాజ్యవాదాన్ని కోరుతూ వచ్చింది. ముస్లింలీగు నాయకులు కూడా యిలాగే యుద్ధానికి సహాయం చెయ్యకుండా, పోరాట కార్యక్రమం యివ్వకుండా, ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ వచ్చారు. ఇంతేకాక, ముస్లిం ప్రజలు అధికసంఖ్యగా ఉన్న ప్రదేశాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ముస్లింలీగ్ నాయకులు కోరడం ప్రారంభించారు ఇదే పాకిస్థాన్.

కేంద్ర ప్రభుత్వంవిషయములో ప్రభుత్వం ఒడంబడికకు వచ్చినట్లయితే కాంగ్రెసుతో సమానమైన రాజకీయ హోదా ముస్లింలీగుకు కావాలని కూడా, లీగ్‌నాయకులు కోరారు. కాంగ్రెసు అట్టి ఒడంబడికను నిరాకరిస్తే, కేంద్రప్రభుత్వంలో ముస్లింలీగుకు తగినంత అధికారం ఉండాలనికూడా లీగునాయకులు కోరారు. ఈ విధంగా, ముస్లింలీగు భారతదేశం యొక్క సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు మాత్రమే కాకుండా, ముస్లింప్రజలు మెజారిటీగా ఉన్న ప్రదేశాలకు స్వాతంత్ర్యము, సమానత్వము, కావాలనీ; మెజారిటీలేని ప్రదేశాలలో వారి విజ్ఞానానికి, విద్యకు, భాషకు ప్రత్యేకరక్షణలు ఉండాలనీ; పోరాడే ఒక సంస్థగా ముస్లిం ప్రజాసామాన్యానికి లీగ్ కనపడింది.

కాబట్టి, ముస్లింలీగుయొక్క పలుకుబడి వట్టి అభివృద్ధి నిరోధక శక్తిగానే వృద్ధి చెందిందని అనుకోకూడదు. పైగా, ముస్లిం ప్రజాసామాన్యంలో అది సామ్రాజ్య వ్యతిరేకోద్యమంయొక్క స్వరూపంగా బయల్దేరింది సింధురాష్ట్రీయులయొక్క, పంజాబీ ముస్లింలయొక్క, పఠానులయొక్క ప్రత్యేక జాతీయాభిమానానికి అదిస్వరూపం.

## పరిష్కారానికి మూలాధారం

హిందూ - ముస్లిం ఐక్యత అనే సమస్యను నేడు వెన్వెంటనే పరిష్కరించవలసియుంది. దేశానికి నేడు సంభవించిన ఆపదను ఎదుర్కోవాలంటే, ఈ సమస్యను తక్షణం పరిష్కరించాలి. అయితే, యిందుకు రెండువిషయాలను మనం గ్రహించి తీరాలి. మొదటిది. ముస్లింలీగ్ నాయకత్వం యొక్క స్వభావము ; రెండోది: ప్రజలలో దాని పలుకుబడికి మూలాధారం. మత సంబంధమైనట్టి, విజ్ఞానసంబంధమైనట్టి, తారతమ్యాలు మాత్రమే ఈసమస్యలోవున్నకీలకం అని అభిప్రాయపడడం పొరపాటు ముస్లింలలో అనాలోచితమైనట్టి, అస్పష్టమైనట్టి, దురభిమానంతోకూడుకొన్నట్టి, లక్షణాలువుండడంవల్లనే, కాంగ్రెసుకు ముస్లిం

లీగుకు మధ్య ఐక్యతసాధ్యం కావడంలేదనడంకూడా పొరపాటే బ్రిటిషు అధికారం దేశంలో వుండడంవల్ల జిన్నా తన సమయానుకూల ప్రయోజనాలకు ఈ లక్షణాలను వినియోగించు కొంటున్నాడని అనుకున్నా, ఈ సమస్యను అర్థం చేసుకోలేదన్నమాట. అలా అనుకుంటే, సామ్రాజ్యవాదం తొలగిపోనంతకాలం మనం ఏమీ చెయ్యలేమనీ, ఐక్యత సాధ్యంకాదనీ చెప్పే గాంధీ వాదానికి మనం దాశితీస్తున్నామన్నమాట. కాని ముస్లింలీగ్ నాయకత్వం బూర్జువా స్వభావాన్ని కలిగియుందనీ; కాంగ్రెసు నాయకత్వం మాదిరి లీగ్‌నాయకత్వంకూడా సామ్రాజ్య వాదాన్ని వ్యతిరేకించుతూందనీ; ముస్లింలీగ్ యొక్క పలుకుబడి హెచ్చడానికి మూలాధారం సామ్రాజ్యవాద వ్యతిరేకతేననీ; తెలుసుకోవాలి. పాకిస్థాన్ కోరికకు మూలం ఏమిటి? సింధురాష్ట్రీయులు, బెలూచి ప్రజలు, పంజాబీలు (ముస్లింలు,) పఠాన్లు, విశాల స్వతంత్ర భారతదేశంలో తమ తమ జాతులుకూడా సంపూర్ణంగా వికసించాలి అని వారు కోరే కోరిక. ఈ కోరిక న్యాయ సమ్మతమైనదని మనం గ్రహించ గలిగితే, యీ మతసామరస్య సమస్యను సులభంగా పరిష్కరించ గలుగుతాం. స్వాతంత్ర్య సంపాదనకు మొట్ట మొదట జాతీమైక్యత అవసరం అనే సక్రమ నినాదాన్ని మనం విడిచిపెట్ట నక్కర్లేదు. జాతీయోద్యమంలో యిటీవల అనుసరించబడిన పంథాలు, విధానాలు, సరిగా అర్థం చేసుకుంటే, జాతీమైక్యతను సాధించడానికి మూలాధారం మనకు సులభంగా గోచరిస్తుంది.

## ప్రత్యేక విజ్ఞానాభివృద్ధికి గ్యారంటీ మాత్రమే చాలదు

నేటివరకు యింత అధికమైన జాతీమైక్యతను సాధించి, జాతీయ స్వాతంత్ర్యము కొరకు కృషిచేస్తూ వచ్చిన భారత జాతీయ కాంగ్రెసు నేడు నెరవేర్చవలసిన చరిత్రాత్మక కర్తవ్యం, వహించవలసిన బాధ్యత, ఎంతో వుంది. మన దేశ చరిత్ర యొక్క నేటి క్లిష్ట పరిస్థితులలో నూతన దశకు పరిణామం చెందిన యీ మత సమస్యను పరిష్కరించడంలో, ఐక్యతకై కృషి చేయడంలో, కాంగ్రెసు మరొక అడుగు ముందుకు వేయవలసియుంది, జాతీయ స్వాతంత్ర్యం కొరకు వేర్వేరు ప్రజా సమూహాలను ఐక్యపరచడంలో, కాంగ్రెసు సంస్థ ఆ స్వాతంత్ర్యాన్ని తిరిగి నిర్వచించవలసియుంది. ప్రజా తంత్ర హక్కులు పౌర స్వత్వపు హక్కులు గల కార్యక్రమానికి అనుగుణ్యంగా, భారత దేశ స్వాతంత్ర్యాన్ని నిర్వచించాలి. ప్రజల యెదుట అట్టి కార్యక్రమాన్ని పెట్టుటలో జాతీయ కాంగ్రెసు చాలా వరకు జయం పొందింది. ఆ కార్యక్రమాన్ని మూలాధారంగా చేసుకొని జాతీమైక్యతను చాలావరకు సమకూర్చ గలిగింది. కాని, నేటి నూతన పరిస్థితులలో ఆ కార్యక్రమం సరిపోదు. కొత్త స్వరూప తో పరిణామం చెందిన మత సమస్యను పరిష్కారం చెయ్యడానికీ, హిందూ-ముస్లిం ఐక్యతను సాధించడానికీ, మరి కొంత కార్యక్రమాన్ని కాంగ్రెసు యివ్వవలసియుంది. స్వతంత్ర భారత దేశంలో ప్రతి ఒక్కరూ దైవారాధన స్వేచ్ఛగా

చేసుకొనే హక్కును కలిగియుంటారనీ, అల్ప సంఖ్యాకుల మత స్వాతంత్ర్యము, వైజ్ఞానికాభివృద్ధి కాపాడబడుతుందనీ, నేటి కాంగ్రెసు ప్రణాళిక ప్రకటించుచున్నమాట వాస్తవమే. కులము (Caste) శాఖ (Creed) పుట్టుక (Origin) వీటినిబట్టి వచ్చే అసమానాత్వాలు (అస్పృశ్యత, మొదలైనవి) నిర్మూలించ బడతాయని కాంగ్రెసు ప్రణాళిక ప్రకటించుచున్నది. యీ ప్రకటనలు ఐక్యతను సమకూర్చుటానికి చాలా అవసరమైనవే కాని, నేడు అవి మాత్రమే చాలవు

## భారతదేశంలో వేర్వేరుజాతులు, వాటి ఐక్యత

మన జాతీయైక్యత యెల్లప్పుడూ ఒకే విధముగా స్థిరస్వభావం గలిగిన సమస్యకాదు; మారుతూవస్తోంది. భారతీయైక్యత దినదినాభివృద్ధి గాంచుతూ, అనేకవిధాల పరిణామం చెందుతూ వచ్చింది అనేక శతాబ్దాలుగా మనదేశంలో వేర్వేరు జాతులు కలసి అభివృద్ధి చెందాయి ఇప్పుడు ఆ యా జాతుల ప్రజలు నూతన చైతన్యాన్ని పొందుతున్నారు. ఆర్థిక నిర్మాణం దేశం అంతటా సమానదశలలో వృద్ధిచెందదు కాబట్టి వేర్వేరుమతస్థులకు, వేర్వేరు జాతులకు, మధ్య సంఘర్షణలు - కలహాలు బయల్దేరుతాయి. అయితే, దేశంలో అన్నిమూలల వ్యాపించుతున్న ప్రజా ఉద్యమాలు యీ వేర్వేరు మతస్థులను, జాతులను, ఐక్యపరచి, స్వాతంత్ర్యముకొఱకు పోరాడే జాతీయైక్య సంఘటనకు దారితీస్తాయి. కాని, సామ్రాజ్యవాదం బుద్ధిపూర్వకంగా వారిలో చీలికలు కలిగించడానికి ప్రయత్నించుచుంది. స్వాతంత్ర్యము కొఱకు ముందుకు నడిచే జాతీయశక్తుల ఐక్యతను విచ్ఛిన్నంచేసి, ధ్వంసం గావించటానికి ప్రయత్నిస్తుంది. జాతీయ కాంగ్రెసుయొక్క నాయకత్వం, జాతీయైక్యత యందలి వేర్వేరుజాతుల అభివృద్ధి, వికాసం, గమనించకుండా, సామ్రాజ్యవాదులపన్నాగంలో పడిపోకూడదు. స్వతంత్రభారతదేశంలో యీ వేర్వేరుజాతుల ప్రజలకు న్యాయంగా యివ్వవలసిన ప్రత్యేక పరిపాలనా హక్కును గుర్తించాలి. వారుకోరినట్లయితే దేశంనుంచి విడిపోయే హక్కునుకూడా యివ్వవలసియుంటుంది. స్వతంత్ర భారతదేశంలో వేర్వేరు జాతులు ఒకే సమిష్టి కుటుంబంగా కలిసియుంటాయనీ ప్రతిజాతి ప్రజలు ఒక్కొక్క ప్రదేశంలో నివశించుతారనీ, ఆ ప్రదేశం చారిత్రక సాంప్రదాయాలను బట్టి, భాషనుబట్టి, విజ్ఞానాన్నిబట్టి, ఒకేఆర్థిక విధానాన్నిబట్టి,నిర్ణయించ బడుతుందనీ-కాంగ్రెసు ఒకరకంగా, అస్పష్టమైరీతిని అంగీకరించింది ఉదాహరణకు : కాంగ్రెసు నియమావళి భాషనుబట్టి రాష్ట్రాలను నిర్ణయించింది. క్రిప్సు సూచనలను నిరాకరిస్తూ వర్కింగ్ కమిటీ గావించిన తీర్మానంలో యీభావమే యింకాస్పష్టంగా తెలియజేయబడింది. వేర్వేరుజాతుల ప్రజలకు స్వయం నిర్ణయహక్కును గుర్తించే విషయంలో కాంగ్రెసు చాలా దగ్గరకు వచ్చింది కానీ, అలహాబాదు ఎ. ఐ. సి. సి. లో కాంగ్రెసుయొక్క యీ దృక్పథం మళ్లీకొంచెం వెనక్కు వెళ్లింది. లాలాజగత్ నారాయణ తీర్మానంవల్ల, ఏ జాతిప్రజలు స్వయంనిర్ణయ హక్కును కలిగియుండరాదని

తెలుస్తోంది. ఎందువల్లనంటే, ఏ ప్రాంతమూ దేశంనుంచి విడిపోవడానికి హక్కు ఉండరాదని ఆ తీర్మానం చెపుతోంది. ఫలితం ఏమైంది? ఐక్యత అనే పేరుతో, ఇండియాను విభజించ కూడదనే సిద్ధాంతంపేరుతో, మతనాయకుల విచ్ఛేదనావిధానానికి తోడ్పడడం అయింది. దీని వల్ల లాభంపొందేది సామ్రాజ్యవాద నిరంకుశాధికారులు.

జాతీయ కాంగ్రెసు ముందంజవేసి, చరిత్రాత్మకమైన బాధ్యతను యింతవరకు నెరవేర్చలేదు. స్వతంత్ర భారత దేశంలో ప్రతిజాతిప్రజలకు స్వయంనిర్ణయహక్కు, సమాన హోదా, యితరులచే అణచబడకుండా స్వేచ్ఛ - ఇవి గ్యారంటీ చేసే కార్యక్రమంపై దేశాన్నంతటినీ కాంగ్రెసు ఐక్యపరచలేక పోయింది. ఇందువల్ల జిన్నా, ముస్లింలీగ్ నాయకత్వం, హిందువులకు వ్యతిరేకంగా ముస్లిములను సమీకరించడానికి అవకాశం చిక్కింది. దేశానికి సంభవించిన యీ ప్రమాద సమయంలో, జాతీయైక్యతను విచ్ఛిన్నం చేయడానికి వీరు పాకిస్థాన్ అను విడిపోయే హక్కును కోరగలుగుతున్నారు. చారిత్రకంగా పరిణామం చెంది, ఒకే భూభాగం, ఒకే భాష, ఒకే విజ్ఞానం, ఒకే మనస్తత్వం, ఒకే ఆర్థిక జీవితం, గలిగిన ప్రజలను ప్రత్యేక జాతులుగా పరిగణించి, వాటికి స్వతంత్ర పరిపాలనా హక్కు, రాజకీయంగా విడిపోయే హక్కు, ఉంటాయని గ్యారంటీ చేసినట్లయితే, మాతృదేశాన్ని ముక్కలు ముక్కలుగా విభజించే మార్గానికి దారితీయదు. పైగా వేర్వేరు జాతుల ప్రజలలో ప్రస్తుతం ఉన్న అవిశ్వాసాన్ని, అనుమానాన్ని, కాంగ్రెసు తొలగించినట్లయితే, వెంటనేవారు కార్యరంగంలో యిప్పటికంటె ఎక్కువ ఐక్యతతో కలసి పనిచేయడానికి పునాది వేయబడుతుంది. ఇంతేకాదు. స్వరాజ్యాన్ని సాధించిన తర్వాత, ఇండియా స్వేచ్ఛ గలిగిన వేర్వేరు జాతుల సమ్మేళనంగా, సోదర భావంతో, అభివృద్ధి చెందుతూంటే, ఇంకా ఎక్కువ ఐక్యత సాధ్యపడుతుంది. ప్రత్యేక జాతులకు విడిపోయే హక్కు ఉన్నట్లయితే, దేశం విచ్ఛిన్నమై పోవడానికి దారి తీస్తుందని వాదించేవారు తమ సోదర దేశీయులను విశ్వసించడం లేదన్న మాట. కాంగ్రెసు ప్రత్యేక జాతుల హక్కును గురించి స్పష్టంగా ప్రకటించినట్లయితే. జిన్నాయొక్క పాకిస్థాన్ నినాదం పటాపంచలై పోతుంది. ఎందువల్లనంటే, పాకిస్థాన్ కోరికయొక్క మూల సూత్రాన్ని అట్టి ప్రకటన అంగీకరిస్తుంది; ఎందుకు పాకిస్థాన్ కావాలంటున్నారో అది యిస్తుంది. సింధు ప్రజలు, బెలూచ్ ప్రజలు, పఠాన్లు, పంజాబీ ముస్లిములు, అవసరమని కోరితే విడిపోయే హక్కును పై ప్రకటన యిస్తుంది. కాని, ఒక్క విషయం మరచిపోకూడదు. ప్రత్యేక జాతులు విడిపోయే హక్కును గుర్తించడం అంటే అర్థం. వారు స్వతంత్ర భారత దేశంలో యితర జాతులతో సమాన హోదాను కలిగి యుంటారనీ, ఎవరూ తమను బంధించి యుంచరనీ, స్పష్టంగా అంగీకరించడమన్నమాట.

ఈ విధానం చీలిపోవడానికి దారి తీయదు; ఐక్యతకు పునాది వేస్తుంది. దేశం మీదికి దండెత్తి వచ్చే దురాక్రమణదారుల్ని అందరూ కలసి ఎదుర్కొంటూ, స్వాతంత్ర్య పోరా

టుగో కలిసి సాగానానికి పై ప్రకటన దారి తీస్తుంది. స్వాతంత్ర్యాన్ని సాధించిన తర్వాత కూడా, వేర్వేరు జాతులు స్వేచ్ఛతో, యిష్టపూర్వకంగా, సహకార మొనర్చుకొంటూ భారత దేశ సమ్మేళనాన్ని నిర్మించుకొన గలుగుతారు.

## పాకిస్థాన్ నినాదంలోని మూలసూత్రం

జాతీయ కాంగ్రెసు పై విధంగా ప్రకటించినట్లయితే, పాకిస్థాన్ ద్వారా ముస్లిములు భారత దేశాన్నుంచి చీలిపోయి వేరుగా ఉండి తీరాలనే విషపూరిత ప్రచారాన్ని జయ ప్రదంగా ఎదుర్కొనగలుగుతాం. ఎందువల్లనంటే, పాకిస్థాన్ కోరికయందలి న్యాయమైన సూత్రాన్ని పై ప్రకటనద్వారా సరాసరి అంగీకరిస్తున్నాం. పైన నిర్వచించినరీతిని ఏభూభాగంలో నైనా ముస్లింమతస్థులు కలిసి ఒక జాతిగా నివసిస్తూన్నట్లయితే, వారు ప్రత్యేక రాజ్యాంగ పరిపాలనా హక్కును ఆంధ్ర, కన్నడ, మరాఠీ, బెంగాలీ ప్రజల మాదిరిగానే, కలిగి యుంటారు. ముస్లిములు అల్పసంఖ్యాకులుగా ఉండే యితర రాజ్యాంగ భూభాగాలలో ముస్లిముల విజ్ఞానానికీ, వారివిద్యకూ, భాషకు తగినరక్షణలుంటూ, వారిహక్కులు గ్యారంటీ చేయబడతాయి. ఇట్టి ప్రకటనచేస్తే, చైతన్యంపొందిన ముస్లిం ప్రజాసామాన్యం పూర్తిగా సంతృప్తి చెందుతారు. ఎందువల్లనంటే, ఇండియాకు స్వాతంత్ర్యంవచ్చినపుడు వారికి సమాన హోదా, ఇతరులెవరూ పీడించకుండా సంపూర్ణస్వేచ్ఛ, ఉంటాయి. కాంగ్రెసు యీవిధంగా ప్రకటించి, స్వాతంత్ర్య సంపాదనకై యీ ప్రకటనకూడా తన కార్యక్రమంలో ఒక భాగం అని తెలియజేస్తూ, జాతీయప్రభుత్వాన్ని లాగుకొనే నిమిత్తం ముస్లి ప్రజలు, ముస్లి లీగ్ కాంగ్రెసుతో కలసి కృషిచేయవలసిందని కోరినట్లయితే, జిన్నాయొక్క వాదనకు స్వస్తి చెప్ప గలం. ఐక్యత సాధ్యమేకాదని వాదించే జిన్నాయొక్కబలం క్షీణించకమానదు ముస్లిము లకూ, భారతీయులకు కూడా స్వాతంత్ర్యం కావాలనిచెప్పే జిన్నాకు అప్పుడు పరీక్షాసమయం వస్తుంది. ఐక్యతకై అతడు అంగీకరించి తీరాలి. అప్పుడు జరిగేది ఏమిటి? భారత ప్రజలందరూ చేయి, చేయి కలిపి దేశాన్ని రక్షించుకొనే నిమిత్తం, తమ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొనే నిమిత్తం, తమ జతీయప్రభుత్వం యొక్క నాయకత్వాన బ్రహ్మాండమైన పోరాటం సాగించుతారు. ఈవిధంగా భారతీయులందరూ కలసి పోరాడటంద్వారా ఏర్పడేది ప్రత్యేకమైన పాకిస్థాన్‌గాని, ప్రత్యేకమైన హిందూరాజ్యంగాని కాదు, వేర్వేరుజాతులు స్వేచ్ఛగా, సోదరభావంతో, కలసి నివసించే భారత సమ్మేళనం.

## పాకిస్థాన్‌యెడల రాజాజీ దృక్పథం

జిన్నాకోరే పాకిస్థాన్‌ను అంగీకరిస్తూ, జాతీయ ప్రభుత్వంకొఱకు కాంగ్రెస్-లీగ్ ఐక్యత కావాలని రాజాజీ అంటాడు మరహా, రాజాజీకి భేదం ఎక్కడ? రాజగోపాలాచారి లీగ్‌నాయకులవైపు తిరిగి, ఆ నాయకులుకోరే పాకిస్థాన్‌ను యిచ్చివేయడమే మంచిదనీ,

రాజనీతి అనీ, వాదిస్తారు. ఈ వైఖరివల్ల జిన్నా చెప్పే "రెండు జాతుల" సిద్ధాంతాన్ని (హిందువులంతా ఒక జాతి, ముస్లిములొక జాతి అనే సిద్ధాంతం) అంగీకరించడం జరుగుతుంది. ఇందువల్ల ముస్లిములకు చీలిపోవడంతప్ప మరొకమార్గంలేదని ఒకవిధంగా అంగీకరించడం అన్నమాట. రాజాజీయొక్క ఉద్దేశం యిది కాదను మాట నిజమే, కాని రెండు చెడుగులలోను జిన్నాయొక్క పాకిస్థాన్ చిన్నచెడుగనీ, దానిని అంగీకరించడం రాజనీతి అనీ, చెప్పడంలో రాజాజీ భారతదేశాన్ని విభజించేమార్గాన్ని సమర్థిస్తున్నాడనీ, దేశాన్ని ఇప్పటికంటె ఐక్య సంఘటనకు దారితీసే మార్గం యిది కాదనీ, కాంగ్రెసువాదులు అభిప్రాయపడ్డారు. హృదయపూర్వకంగా కాంగ్రెసు-లీగ్ ఐక్యతకై రాజాజీధైర్యంతో ముందుకు రావడంవల్లను, యితడే పెద్ద కాంగ్రెసు నాయకులందరి కంటెముందు సమస్యా పరిష్కారానికి పూనుకోవడ వల్లను, ముస్లిం ప్రజాసామాన్యం యీతనిని ఎక్కువగా బలపరిచారు. కాని యీ కారణంవల్లనే కాంగ్రెసు వాదులలో అత్యధిక సంఖ్యాకులు యీతనిని విచ్ఛిన్నకారిగా పరిగణించారు. రాజాజీ యిట్టివాడేనని గాంధీవాదులు, హిందూ మహాసభవారు ఖండిస్తున్నారు. కాంగ్రెసు-లీగ్ ఐక్యతకై సదుద్దేశంతో రాజాజీచేసే ప్రచారం అంతా జాతీయ శక్తుల విచ్ఛిన్నానికే దారి తీస్తుందని వీరి వాదన. పాకిస్థాన్ విషయంలో రాజాజీ దృక్పథం ఎక్కడ లోపభూయిష్ఠమైనదంటే, కేవలం నాయకులకు, నాయకులకు మధ్య జరగవలసిన ఒడంబడికయొక్క స్వభావాన్ని యిది కలిగియుంది. ముస్లిం ప్రజాసామాన్యానికి న్యాయం కలుగజేస్తూ, భారతదేశ ఐక్యతనుకూడా పెంపొందించి బలపరిచే మార్గాన్ని కాంగ్రెసవాదుల యెదుట రాజాజీ పెట్టలేపోయాడు.

## మనం సూచించే పరిష్కారమార్గం

అయితే యీ సమస్యను మనం ఎలా పరిష్కరించుతాం ? స్వతంత్ర భారతదేశంలో వేర్వేరు జాతులు సమాన హోదా, స్వేచ్ఛ, కలిగియుండే హక్కును మనం గుర్తిస్తాం. ఈ విధంగా పాకిస్థాన్ కోరికయందలి మూలసూత్రాన్ని మనం అంగీకరించుతాం. ఈ వైఖరిని కాంగ్రెసు తీసుకుంటే, జిన్నా నిరాకరించలేడు. ఇదే విధంగా కాంగ్రెసవాదులలో అధిక సంఖ్యాకులు, దేశీయులందరూ చీలిపోకుండా ఐక్యపడడానికి అవకాశం మన సూచనలో ఎలా వుందో గ్రహించగలుగుతారు. ముస్లిం ప్రజలకు మనం చెప్పేదేమంటే : "పైన నిర్వచించిన విధంగా ప్రతిజాతికి స్వేచ్ఛ, సమానహోదా, ప్రత్యేకరాజ్యాంగ పరిపాలన హక్కు, యివ్వడానికి కాంగ్రెసు సిద్ధంగా ఉన్నది, ఈ విధ గా ముస్లింజాతులు ప్రత్యేకమైన రాజ్యాంగ పరిపాలన యేర్పరచుకోవడానికి, ఇతర రాష్ట్రాలలో ముస్లిం విజ్ఞానం, ముస్లిం విద్య, ముస్లిం భాష - వీటికి తగిన రక్షణ యివ్వడానికి గ్యారంటీ ఉంటుంది. కాని యీ హక్కులు మీకు రావాలంటే దేశానికి స్వాతంత్ర్యం కావాలి. దానిని కాంగ్రెసు-లీగ్ ఐక్యతద్వారా

మనం సాధించాలి. కాబట్టి అన్ని జాతుల స్వయంనిర్ణయ హక్కును ఆధారంగా తీసుకొని, కాంగ్రెసుతో చేయి చేయి కలుపవలసిందని మీరు లీగ్‌ను ఒప్పించండి. అప్పుడు అందరమూ కలిసి స్వాతంత్ర్యం సంపాదించ గలుగుతాం." హిందువులతో మనం ఏమి చెప్పుతామంటే: "కాంగ్రెసు సంస్థ ఐక్యతకు నిలబడుతుంది; దేశం తుత్తునియలుగా చీలిపోవడం కాంగ్రెసు కోరదు కాని దీనిని సాధించడానికీ, స్వాతంత్ర్య సంపాదనకూ, మార్గం, వేర్వేరు జాతులు కలిసి స్వేచ్ఛకై పోరాడుతూ, ఇష్టపూర్వకంగా సహకార మొనర్చుకోవడం. భారత దేశంలో ఉన్న వివిధ జాతులు స్వేచ్ఛతోను, సమానహోదాతోను, అభివృద్ధిచెందే హక్కును గుర్తించడంవల్లనే భారతదేశంయొక్క ఐక్యత, స్వాతంత్ర్యము, సాధ్యమవుతాయి. అప్పుడే వాటిని నిలబెట్టుకో గలుగుతాం కాబట్టి మనం యీ హక్కును సుహృద్భావంతో గుర్తించుదాం. గుర్తించి అన్యోన్య సహకారంపై ఆధారపడే స్థిరమైన ఐక్యతను నిర్మించుదాం. శ్రీ రాజగోపాలాచారిలో సరియైన రాజకీయాలోచన, అధికమైన దేశభక్తి ఉండడంవల్లనే అతను కాంగ్రెస్-లీగ్ ఐక్యతయొక్క ప్రాముఖ్యతను, తక్షణమే దాన్ని సాధించవలసిన అవసరాన్ని గుర్తించాడు. ఈ సుగుణాలే ఆయనను నేడోరేపో పై సిద్ధాంతాలను అంగీకరించేటట్లు చేస్తాయి."

## ముగింపు

భారతదేశం ఏకఖండంగా వుండాలనీ, దానిని విభజించడానికి వీలులేదనీ, గాంధీగారంటారు. ఇది ఆయనయొక్క మత సిద్ధాంతం. ఈ మత సిద్ధాంతాన్ని గాంధీజీ ఎలాగు రక్షించాలని కోరుతున్నాడు? పాకిస్థాన్ నినాదాన్ని ఆయన ఎలాగు ఎదుర్కోదలచుకున్నాడు? దాని లోవున్న న్యాయమైన హక్కును నిర్లక్ష్యముచేయడంద్వారా: ముస్లింజాతుల ప్రత్యేక రాజ్యాంగ పరిపాలనాహక్కును నిరాకరించడం ద్వారా. దీనివల్ల ద్వేషం, ఘర్షణ, ఎక్కువ అవుతాయి. ఇక జిన్నా తన పాకిస్థాన్‌కొరకు ఎలా పోరాడ దలచుకున్నాడు? ముస్లిం ప్రజల స్వాతంత్ర్యం కొరకు అత దేలాగున పోరాడదలచుకున్నాడు? ముస్లిం ప్రజాసామాన్యంలో వేరుపడడంతప్ప గత్యంతరం లేదంటూ ప్రచారంచేయడం ద్వారా కాంగ్రెసుకూ-లీగ్‌కూ మధ్యగల విభేదాన్ని ఇంకా యెక్కువ చేయడం ద్వారా. ఈ విధానంవల్లకూడా ద్వేషం, ఘర్షణలు ఎక్కువ అవుతాయి

ఈ క్లిష్ట సమయంలో గాంధీజీ చూపించే మార్గంగాని, జిన్నా చూపించే మార్గంగాని, దేశాన్ని ముందుకు తీసుకొని పోజాలదు మనదేశంమీదికి అతిక్రూరమైన శత్రువు దుమకడానికి సిద్ధంగా ఉన్నాడు నిరంకుశాధికార వర్గం మన నెత్తిమీద బిగించుకొని కూర్చొని, అధికారం చలాయిస్తోంది. దేశీయులు ఫాసిస్టులను తీవ్రంగా ప్రతిఘటించకుండా యీ నిరంకుశాధికారవర్గం ఆటంకాలు కలిగించుతోంది పూర్తియైన ప్రజా ప్రతిఘటన ఉంటేనే ఇండియాకు బర్మాగతి పట్టకుండా చేయవచ్చునను యథార్థాన్ని వీరు గ్రహించకుండా వున్నారు.

ఇక మన జాతీయ నాయకులు నిరంకుశాధికార వర్గాన్ని తీవ్రంగా ఖండించి, చేతులు ముడుచుకొని కూర్చున్నారు. బ్రిటిషు ప్రభుత్వపు మొండిపట్టుదలవల్లను, కార్యశూన్యత వల్ల యేర్పడిన ఆశాభంగమువల్లను, నాయకులు అహింసాయుతమైన "పోరాటాన్ని" ప్రారంభింప నిశ్చయించుకున్నారు. (ఈ వ్యాసం ప్రకటించబడిన తరువాత బొంబాయి ఎ. ఐ. సి. సి. లో "పోరాట" తీర్మానం ఆమోదించబడింది) ఈ పోరాటంవల్ల బ్రిటిషు ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని యిస్తుందనీ, అప్పుడు జయప్రదంగా ఫాసిస్టు దురాక్రమణ దారులను ఎదుర్కోవచ్చుననీ, జాతీయనాయకుల అభిప్రాయం. జాతీయ ప్రభుత్వం ద్వారా ఫాసిస్టులను జయప్రదంగా ఎదుర్కోగలమనే అభిప్రాయం సరియైనదే కాని అవలంబించిన మార్గంమట్టుకు యిందుకు దారితీయదు. నేటి పరిస్థితులలో "అహింసాయుత పోరాటం" వల్ల నిరంకుశాధికారవర్గం లొంగిరాదు. దానివల్ల దేశంలో ఇప్పటికంటె యెక్కువగా అనైక్యత వ్యాపించుతుంది. ప్రపంచమండలి అభివృద్ధి శక్తుల సహకారం నుంచి మనం దూరమైపోతాం. ఈ మార్గాన్ని అవలంబిస్తే, దేశంలో జాతీయ శక్తులు విచ్ఛిన్నం అవుతాయి. ఐక్యతరాదు. నిరంకుశాధికార వర్గాన్ని లొంగదీయలేక పోవడమే కాకుండా వారు మరింత బలపడతారు. ఈ మార్గంవల్ల బ్రిటిషు ప్రజల హక్కులకు, భారతీయుల హక్కులకు, భంగం వాటిల్లుతుంది. ఫాసిస్టు నరహంతకులు మాత్రం మందహాసంతో సమయంకొరకు నిరీక్షిస్తూ కూర్చుంటారు.

ఈ ప్రమాదం జరుగకుండా యిప్పుడుకూడ కృషిచేయవచ్చును. కాంగ్రెసు సంస్థ ఈ ఆఖరు నిమిషంలో సహితము జాతీయైక్యతను సాధించాలి. ప్రత్యేక జాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని ఆధారంగా తీసుకొని, కాంగ్రెసు - లీగ్ ఐక్యతను నెలకొల్పాలి. ఆ సూత్రాన్ని అంగీకరిస్తే జాతీయైక్యత తప్పక సాధ్యమవుతుంది. మన దేశాన్నంతటినీ, ప్రపంచమండలి స్వాతంత్ర్య ప్రియుల సహకారంతో, సంపూర్ణ స్వాతంత్ర్యం వైపు నడిపే మార్గం యిదొక్కటే మరొక మార్గం లేనేలేదు.

— కామ్రేడ్ జి. అధికారి

6—8—42

# పాకిస్థాన్ : జాతీయైక్యత

## (సెంట్రల్‌కమిటీ ప్లీనం తీర్మానం)

నేటి జాతీయ ప్రతిష్టంభనను పరిష్కరించాలంటే - జాతీయ ప్రభుత్వాన్ని మనం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చేతుల్లోనుంచి లాక్కోవాలంటే- మన మాతృదేశాన్ని ఫాసిస్టు దురాక్రమణదారులు ఆక్రమించుకోకుండా రక్షించాలంటే; సర్వతోముఖమైన జాతీయైక్యతను వెంటనే మనం సాధించాలి. ఈ జాతీయైక్యతకు పునాదులు మత సామరస్యం, కాంగ్రెసు లీగ్ సంయుక్త సంఘటన ఇందువల్లనే నేడు పాకిస్థానా? లేక భారతదేశ ఐక్యతా? అనే సమస్యపై చర్చ ఎక్కువ ప్రాధాన్యత వహించుతోంది. కాబట్టి యీ సమస్యపై కమ్యూనిస్టు పార్టీ తన పాలసీయొక్క ముఖ్య సూత్రాలను ప్రకటిస్తోంది.

## మత సామరస్యానికి మూలం

1. అన్ని కులాలలోను, అన్ని మతాలలోను, అన్ని జాతులలోను, వున్న కష్టజీవుల్ని కమ్యూనిస్టు పార్టీ. ట్రేడ్ యూనియన్లు, రైతు సంఘాల, మొదలైన వర్గ సంస్థల ద్వారా దగ్గరకు తీసుకొస్తుంది. మన దేశ స్వాతంత్ర్యాన్నీ, ప్రజాస్వామిక విధానాన్నీ, సంపాదించడానికవసరమైన జాతీయైక్య సంఘటనను యీ కష్టజీవులే నడిపించగలవారు, అగ్రగాములై నడిపించగలిగేటట్లు వీరిని కమ్యూనిస్టుపార్టీ రాజకీయంగా ఐక్య పరుస్తుంది. మతసామరస్యాన్ని సాధించడానికి యిదే మూల సిద్ధాంతం.

2. మన దేశాన్ని రక్షించుకొంటూ స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి, దేశంలో నివసించే వేర్వేరు మతాల ప్రజలు, జాతులు, జాతీయైక్య సంఘటనగా యేర్పడాలి. కాని, యిట్టి సంఘటనను నిర్మించటానికి ఆయా ప్రజలలోగల పరస్పర సందేహాలు, అనుమానాలు, తొలగించాలి. ఈ సందేహాలకూ, అనుమానాలకు కారణాలు రెండు మొదటిది: పూర్వ చరిత్రలో జరిగిన అన్యాయాలు మనస్సులలో యింకా మిగిలియుండడం. రెండవది: నేడు సామంత ప్రభువులు—సామ్రాజ్యవాదులు కలిసి దేశంలో జరిపే దోపిడీకి (Feudal-imperialist exploitation) ఫలితంగా సమాజంలో యేర్పడిన ఎక్కువ తక్కువలు కూడా యీ అనుమానాలకు, సందేహాలకు కారణం. వేర్వేరు మతాల ప్రజలలోను, జాతులలోను గల అనుమానాలు తొలగించాలంటే, వారి వారి ప్రాథమిక హక్కులను గుర్తించాలి. ఈ ప్రాథమిక హక్కులు జాతీయైక్య సంఘటనయొక్క కార్యక్రమంలో ముఖ్యమైన భాగంగా చేర్చాలి.

# జాతీయైక్య సంఘటనయొక్క కార్యక్రమం

3. జాతీయైక్య సంఘటనయొక్క కార్యక్రమాన్ని యీ క్రింది విధంగా ప్రకటించాలి. స్వతంత్ర భారత దేశంలో కలిసిమెలిసి జీవించే వేర్వేరు జాతులకు, మతాల ప్రజలకు, మధ్య సంపూర్ణమైన సమానత్వం వుంటుంది. ఒక జాతి మరొక జాతిపై అధికారం చలాయించి బాధించదు. కులాలను బట్టి, మతాలను బట్టి కలిగే యిబ్బందులు నాధారంగా చేసుకొని యెక్కువ తక్కువలు పాటించబడవు. దీన్ని రుజువు చేయడానికి జాతీయోద్యమం యీ క్రింది హక్కుల్ని గుర్తించుతూ జాతీయైక్యతయొక్క కార్యక్రమంలో వీటిని చేర్చాలి.

(ఎ) ఒకే భూభాగాన్ని తమ జన్మభూమి (Homeland) గా పరిగణించుకొంటూ ఒకే చారిత్రక సాంప్రదాయం (Historical tradition), ఒకే భాష, ఒకే విజ్ఞానం, ఒకే మానసిక తత్వం, ఒకే ఆర్థిక జీవనం గలిగిన ప్రజలు వేర్వేరు జాతులుగాగుర్తించబడతారు. స్వతంత్ర భారతసమితి, (Union) లేక సమాఖ్యలో (Fedaration) వీరుప్రత్యేక రాజ్యాంగాన్ని నిర్మించుకోడానికి హక్కు గలిగియుంటారు. ఇష్టం లేకపోతే వీరు స్వతంత్ర భారత సమాఖ్యనుంచి విడిపోయే హక్కుకూడా కలిగియుంటారు. దీని అర్థం, అట్టిజాతుల జన్మభూములుగా పరిగణింపదగు ప్రదేశాలు, స్వతంత్రభారత దేశంలో నేటిమాదిరిగా కాక, తిరిగి విభజించబడి, ఆయాజాతులకు స్వాధీనం చేయబడతాయి. నేడు వారి జన్మభూములు బ్రిటీష్ యిండియా రాష్ట్రాలనీ, "భారత సంస్థానాలనీ," కృత్రిమసరిహద్దులలో విభజింపబడియున్నాయి. స్వాతంత్ర్యము గలిగిన భావి భారతదేశంలో వేర్వేరు జాతుల స్వతంత్ర రాజ్యాలు కలసి ఒక అటానమస్ స్టేట్సుయొక్క యూనియన్, లేక ఫెడరేషన్‌గా పరిపాలింపబడుతుంది పఠానులు, పశ్చిమ పంజాబీలు (అత్యధికభాగం ముస్లిములు), శిఖ్ఖులు, సింధీలు, హిందూస్థానీయులు, రాజస్థానీయులు, గుజరాతీయులు, బెంగాలీలు, బిహారీలు, ఒరియాలు, ఆంధ్రులు, తమిళులు, కర్నాటకులు, మహారాష్ట్రులు, కేరళులు, ఇత్యాదులు మనదేశంలో వివిధజాతులు.

(బి) ఈవిధంగా క్రొత్తగా విభజించబడు జాతులు చెల్లాచెదరైన అల్పసంఖ్యాకులుగా వుండే వారి విజ్ఞానం, భాష, విద్య, విద్యాలయాలు మొదలైనవాటిపైగల హక్కులు శాసన రీత్యా గ్యారంటీ చేయబడుతాయి. అట్టిశాసనాలను ధిక్కరిస్తే, చట్టప్రకారం శిక్ష విధించబడుతుంది.

(సి) కులాలను బట్టి, మతాలను బట్టి, మానవజాతుల్ని (Races) బట్టి, కలిగే యిబ్బందులు, ప్రత్యేకాధికారాలు, అన్యాయాలు (ఉదాహరణకు; అస్పృశ్యతవంటి అక్రమాలు) శాసనరీత్యా రద్దుచేయబడుతాయి. అట్టి చట్టాలను ధిక్కరిస్తే శిక్ష విధింపబడుతుంది.

## కాంగ్రెస్-లీగ్ ఐక్యతకు పునాది

4. ఈవిధంగా ప్రకటించడంవల్ల పై నిర్వచనం ప్రకారం జాతు లన్నింటికీ ప్రత్యేక రాజ్యాంగాధికారం, విడిపోయే హక్కు యివ్వబడుతుంది. అందుచే మహమ్మదీయ మతం గలిగిన జాతులకు ఈ అధికారం యివ్వబడుతుంది. కాంగ్రెస్‌కూ-లీగ్‌కూ మధ్య ఐక్యత సమకూర్చడానికి పైవిధమైన ప్రకటన పునాది. ఎందువల్లనంటే, తాము జన్మభూమిగా పరిగణించే భూభాగంలో మహమ్మదీయులు అత్యధిక సంఖ్యాకులుగా వుంటే, వారికి ప్రత్యేక రాజ్యాంగాధికారం, ఇష్టం లేకపోతే విడిపోయే హక్కు, యివ్వబడుతాయి. ఇలాగే బెంగాలులో యిపుడున్న తూర్పుజిల్లాలలోను, ఉత్తర జిల్లాలలోను, మహమ్మదీయులు అత్యధిక సంఖ్యాకులుగా వున్నారు కాబట్టి అక్కడి బెంగాల్ రాజ్యాంగపరిపాలనలో ముస్లింలు తామొక స్వతంత్ర ప్రదేశాన్ని కలిగియుండవచ్చు; లేదా అందులోనే ఒక భాగంగా అటానమస్ రిజియన్‌ను స్థాపించుకొనవచ్చు. కాబట్టి పైవిధంగా ప్రకటన గావించితే పాకిస్థాన్ కోరికలో గల ముఖ్యాంశాన్ని గుర్తించడం జరుగుతుంది. దీనికీ, ఇండియాను మతాలనుబట్టి రెండుజాతులుగా చీల్చాలనిచెప్పే సిద్ధాంతానికీ, యెట్టి పోలికలేదు.

## కార్యరంగంలో ఐక్యత

5. ఈవిధమైన విడిపోయేహక్కును గుర్తించితే, తప్పనిసరిగా విడిపోవడం జరగనవసరంలేదు. పైగా, పరస్పరమైన అనుమానాలను తొలగించడం వల్లవెంటనే యీరోజున, కార్యరంగంలో ఐక్యత యేర్పడుతుంది. ఈ ఐక్యత స్వాతంత్ర్యం గలిగిన భావి భారత దేశంలో అత్యున్నతమైన ఐక్యతకు పునాదిగా వుండగలదు. మన మాతృభూమిని రక్షించుకోవడానికి చేసే సంయుక్త పోరాటంద్వారా అది బలపడుతుంది. యుద్ధానంతరం యేర్పడే స్వతంత్రసమితి (యూనియన్) లేక సమాఖ్య(ఫెడరేషన్)లో, కలిసి యుండడం యెందుకవసరమో అన్నిజాతుల ప్రజలుతప్పక గ్రహించగలుగుతారు. స్వాతంత్ర్య సమరంలోఐక్యతనుసాధించిన తర్వాత అందరూకలిసి తమస్వాతంత్ర్యాన్నీ, తమప్రజాస్వామికప్రభుత్వాన్నీ, విజయాన్ని రక్షించుకొనేటందుకు; స్థిరమైన ఆపునాదిపై పూర్వమెన్నడూ కని విని యెరుగని అత్యున్నతమైన జాతీయైక్యతను నిర్మించడానికీ; అన్ని జాతుల ప్రజలు తప్పక కలిసి యుండవలసిన అవసరాన్ని గ్రహించుతారు.

## ఐక్యతకై ప్రజల వాంఛ

పైకి యీ రోజున యెన్నో తగాదాలు, యెన్నో క్లిష్ట సమస్యలు, కనపడుతున్నాయి. కాని కాంగ్రెసు అనుచరులు, లీగ్ అనుచరులు అయిన ప్రజా బాహుళ్యం జాతీయైక్యతకై చూపే వాంఛ నానాటికి హెచ్చుతూంది. ఫాసిస్టు దండయాత్రయొక్క ఉపద్రవం రోజురోజూ యెక్కువౌతున్నకొద్దీ, నేటి జాతీయ ప్రతిష్టంభన నానాటికి విషమ దశకు వస్తున్నకొద్దీ,

యీ రెండు సంస్థల నాయకులు దగ్గరకు వచ్చారు. ఈ తీర్మానంలో సూచించబడిన పరిష్కార మార్గం వైపుకే వారు వస్తున్నారు.

ఐక్యత విషయమై నిరాశ చెందడానికి నేడు కారణం కనపడదు. దేశభక్తులందరూ కమ్యూనిస్టులతో చేతులుకలిపి, యిందులో పేర్కొనబడిన సూత్రాలను ప్రజలందరికీ తెలియజేసి, ప్రచారం సలుపవలసిందనీ, ఆ విధంగా కాంగ్రెసు - లీగ్ ఐక్యతను వేగంగా సాధించవలసిందనీ; కమ్యూనిస్టుపార్టీయొక్క విజ్ఞప్తి. ఎందువల్లనంటే, మన మాతృదేశానికి సంభవించనున్న మహోపద్రవంనుంచి దేశాన్ని కాపాడటానికి యిదొక్కటే మార్గం.

20—9—42

# పాకిస్థాన్ - జాతీయైక్యత

## (కామ్రేడ్ జి. అధికారి రిపోర్టు)

జాతీయైక్యత - హిందూ ముస్లిం ఐక్యత, అనే సమస్య మనకెప్పుడూ ప్రధానంగానే వుంటూంది కాబట్టి జాతీయోద్యమంతోపాటు యీ సమస్యయొక్క పరిణామాన్ని పూర్వాపర సందర్భాలతోపాటు చూస్తేనేగాని, ప్రస్తుత స్వరూపాన్ని సరిగా అర్థం చేసుకోలేము. జాతీయోద్యమం ఎన్ని దశలను గడిచిందో, దానితోపాటు యీ సమస్య అన్ని దశలను గడిచింది. కాబట్టి నేటి జాతీయోద్యమంలో దానికి గల ప్రాముఖ్యతను గుర్తించాలంటే, దాని పూర్వ చరిత్రను, నడకను, పూర్వాపర సందర్భాలను, కూడా సరిగా తెలుసుకోవాలి. కాని, పాత ధోరణిలోనే యీ సమస్యను గురించి ఆలోచించడం యింకా మనలో మిగిలి వుంది. ఇది సహజమే కాని, యీ పాత దృక్పథంతో ఆలోచించడంవల్ల ఆచరణలో పొరపాట్లకు తావిస్తుంది సిద్ధాంతరీత్యాయేకాదు, చారిత్రక పరిణామ రీత్యాకూడా. యీ పొరపాట్లకుకారణాలేమిటో తెలిసికోవాలి. లేదా,ఆపొరపాట్లను మనంపూర్తిగా పోగొట్టుకోలేము. కామ్రేడ్సు అడిగే సందేహాలకు, ప్రశ్నలకు, కారణమేమిటి? యుద్ధ ప్రారంభానికి పూర్వం మనం యీ సమస్యను పరిష్కరించడానికి అవలంబించిన మార్గమే దీనికి కారణం. అందుచేతనే, జాతీయోద్యమంలోని మూడు దశలలోను హిందూ ముస్లిం ఐక్యతా సమస్య ఏ విధముగా పరిణామం పొందిందో, చారిత్రకంగానూ, రాజకీయంగానూ పరిశీలించడం అవుసరం. ఈ విధంగా సమస్యను పరిశీలించటంవల్లనే నేడు పాకిస్థాన్ నినాదంయొక్క ప్రాముఖ్యతను, జాతీయ స్వయంనిర్ణయ సూత్రంయొక్క ప్రాముఖ్యతను, గుర్తించ గల్గుతాం. ఈ విధంగా పరిశీలించటంవల్లనే యింతవరకూ బయలుదేరని యీ నినాదాలు, కోర్కెలు, యిప్పుడే, యీ సమయంలోనే, బయలుదేరడానికి గల కారణాలను తెలుసుకో గల్గుతాం.

మనం ఒకసారి యీ సమస్యా పరిణామాన్ని సింహావలోకనం చేస్తే, మూడు దశలలో మూడు స్పష్టమైన దృక్పథాలలో, దీనిని మనజాతీయ నాయకులు పరిశీలించారనీ, ఒక్కొక్క దృక్పథం ఆనాటి జాతీయోద్యమం యొక్క ప్రత్యేక దశను అనుసరించి యున్నదనీ, తెలుసుకొన గల్గుతాం.

### ప్రథమ దశ

భారత దేశమంతా ఒకే జాతి అనే దృష్టి పూర్వకాలపు జాతీ యోద్యమంలో ప్రధానంగా వుండేది. హిందువులకూ, మహమ్మదీయులకూ మధ్యగల భేదం మతసంబంధమైనది మాత్రమేననీ, యీ రెండు మతాలవారిలోనూ జాతీయ భావాలు అభివృద్ధి చెందినకొద్దీ

మత భేదాలుకూడా పోయి, ఒక జాతిగా ప్రజలుఅభివృద్ధి చెందుతారనీ, జాతీయ వాదులు గట్టిగా విశ్వసిస్తూ వుండేవారు. సామ్రాజ్యవాదంతో పోరాడే నిమిత్తం జాతీయతను వృద్ధి చేయడంవల్లనే ఐక్యతను చేకూర్చ గల్గుదుమనీ, అదే పరిష్కార మార్గమనీ వారు విశ్వసించేవారు.జాతీయోద్యమంయొక్క ప్రథమావస్థలోమితవాద నాయకులుపైవిధంగానేప్రచారం చేశారు. యీ మితవాదులే శైశవావస్థలో వున్న జాతీయోద్యమానికి నాయకత్వం వహించేవారు. "హిందూ ముస్లిం సమస్యను పరిష్కరించడానికల్లా వారిలో (హిందూ - ముస్లింలలో) జాతీయ భావాలు కల్గటమే కావలి" అని ఆనాటి జాతీయ నాయకులైన మితవాదులు వాదించేవారు ఈ దశ 1921 వరకూ వుంది. కాంగ్రెస్ - ఖిలాఫత్ వుద్యమాల ఐక్యతతో యీ దశ పరిపూర్ణతను చెందింది.

## రెండవ దశ

(1921 నుండి 1936 వరకూ) ఈ దశలో జాతీయోద్యమం మరి కొంత ముందుకు నడిచింది. దానితోపాటు హిందూ - ముస్లిం ఐక్యతా సమస్య కూడా వృద్ధిచెందింది. నిజానికి జాతీయోద్యమంలో అంతర్గతంగా వున్న భాగంగానే అది ముందుకు సాగుతూ వచ్చింది. ఈ కాలంలోనే జాతీయ పెట్టుబడిదారీవర్గం పెరుగుట, బలపడుట, జాతీయోద్యమంతో మిళితమగుట, జరిగింది. కాని యీ అభివృద్ధితోపాటుగానే రెండు విధాలుగా పరిణామం చెందింది. ఒకటి: ఉభయమతాలలోని పెట్టుబడిదారీ వర్గాలకు వాటిలో వారికి స్పర్థలు, దెబ్బలాటలు కలిగాయి. రెండవది: కూలీల, రైతుల వర్గ చైతన్యం, పోరాటాలు వృద్ధి చెందాయి. ఈ విధంగా జాతీయోద్యమంలోనే ఒకదానిప్రక్క మరొక ప్రకృతిని చూస్తాం. ఒకటి: పెట్టుబడిదారీ వర్గంలో కలహాలు, స్పర్థలు; రెండవది: కూలీల, రైతుల ఐక్యత, పోరాటశక్తి. కాబట్టి యీ దశలో హిందూ - ముస్లిం ఐక్యతా నినాదం యీ క్రింది విధంగా ఉండేది, "ఈ సమస్య పెట్టుబడిదారీ వర్గానికి, ధనిక వర్గానికి మాత్రమే సంబంధించిన సమస్య. హిందూ - ముస్లిం ప్రజా సామాన్యానికి యీ తగాదాతో యెట్టి సంబంధం లేదు కాబట్టి ఉభయ మతాల ప్రజా సామాన్యానికి కావలసిన ఆర్థిక సమస్యలమీద పోరాటాల్ని బయలుదేర దీయటంద్వారా ఐక్యతను చేకూర్చాలి, అదే సమస్యా పరిష్కారం".

## మూడవ దశ

ఇది 1937 నుండి అనగా కాంగ్రెస్ మంత్రివర్గాలనుండి, ప్రారంభమైంది. ఫాసిజం ప్రపంచంలో అన్ని మూలలా బ్రహ్మాండమైన దాడి సాగించేకాలం యిది. కాబట్టి, అంతర్జాతీయ రంగంలో ఫాసిస్టు అపాయాన్ని ఎదుర్కోవడానికిగాను ప్రతి దేశంలోను జాతీయైక్యతను నిర్మించవలసిన అవసరం ఏర్పడింది. జాతీయైక్య సంఘటనకు ప్రాధాన్యత యేర్పడింది. హిందూ-ముస్లిం ఐక్యత ప్రధాన కార్యక్రమంలో చేర్చ

బడింది. మరొక వైపు యుద్ధ ప్రమాదం ముంచుకు వస్తూంది. కాబట్టి, అధికారం హస్తగతం చేసుకోవలసిన అవసరం ప్రధానమైనది. ఈ విధంగా యుద్ధ ప్రమాదం నానాటికి హెచ్చటం, సామ్రాజ్యవాదంలో విషమ పరిస్థితులు ఏర్పడటం, యీ రెండు పరిస్థితులూ హిందూ-ముస్లిం ఐక్యతా సమస్యకు కొత్త రూపాన్ని యిచ్చాయి. ఈ నూతన పరిస్థితులలో రాజ్యాంగ సంస్కరణలకు ప్రాధాన్యత లేదు. ఎన్నికలలో మతప్రాతినిధ్యం వుండాలా, సమిష్టి ప్రాతినిధ్యం వుండాలా? అనేవి ప్రధానమైనవి కాదు; అధికారం ఎవరికి? అనేది మిక్కిలి ప్రధానమైంది. అధికారాన్ని ఎలా సంపాదించాలి? అనేవి యీ యుద్ధ ప్రమాదం వల్ల భారతీయులకు ప్రధాన సమస్యగా పరిణమించింది. సరిగా యీ సమయంలోనే కూడా ముస్లిం లీగ్ ముస్లింలకు ప్రత్యేకరాజ్యాంగం కావాలి అనే నినాదాన్ని బయలుదేరదీసింది. ఈ విధంగా, హిందూ-ముస్లిం సమస్య ముస్లింలకు ప్రత్యేక రాజ్యాంగం కావాలి అన్న కొత్త రూపంలో బహిర్గతమైంది. ముస్లింలు "అణచబడ్డ సంఘం" అనే వాదన అంతకంతకు రాజకీయ చర్చలలో ముందుకు వచ్చింది. ఈవిధంగా యుద్ధ ప్రమాదంవల్ల ఐక్యతా సమస్య "అధికారాన్ని సంపాదించే" ప్రధాన సమస్యగా కన్పడింది. ఈసమయంలోనే "పాకిస్థానా, దేశ స్వాతంత్ర్య మా ముందు?" అనే చర్చకూడా బయలుదేరింది.

ఈ విధంగా మనం ఐక్యతా సమస్యను చారిత్రకంగానూ, రాజకీయంగానూ, పరిశీలిస్తే పై మూడు దశలలో మూడు రకాలుగా యీ సమస్యా పరిష్కారాన్ని గురించి ఆలోచించారన్నమాట. పైమూడు దశలలోను మూడు విధాలుగా పరిణామం చెందిందని తెలుసుకొనగలుగుతాం. ఈలా చూడటంవల్లనే పరిష్కార మార్గాలు ఆయా జాతీయోద్యమ దశలకు అనుగుణ్యంగావున్నాయనీ, జాతీయోద్యమంలోనే ఉత్పన్నమైనాయనీ, తెలుసుకుంటాము అయాదశలలో, ఆ యా విధాలుగా, ఎందుకు పరిశీలించారో చారిత్రక దృష్టితోనూ, రాజకీయంగానూ, చూస్తేనే తెలుస్తుంది. ఇట్టి పరిశీలనవల్లనే ఆది ఏ విధంగా పరిణామం పొంది నేటి దశ ఏర్పడిందో తెలుసుకొన గల్గుతాం. ఇంతేగాక, దాని కనుగుణ్యంగానే కార్మికవర్గం యీ సమస్యను నేడు ఏ విధంగా పరిష్కరించుటకు నూతన మార్గాలు తొక్కాలో కూడా తెలుస్తుంది.

ఇప్పుడు ఒక్కొక్క దశను ప్రత్యేకంగాను, వివరంగాను పరిశీలిద్దాం.

## "ఇంగ్లాండు మాదిరిగా ఇండియాకూడా ఒక జాతి"

మొదటి దశ:—మన జాతీయోద్యమం శైశవావస్థలోవున్న దశ యిది. ఈ వుద్యమంలో పాల్గొన్నదీ, నాయకత్వం వహించినదీ, మేధావులలోని పై తరగతులవారు, ఉద్యోగస్థులు, మాత్రమే. మితవాదులు అయినయీ మేధావులు విక్టోరియారాణి పరిపాలిస్తున్న కాలం నాటి ఇంగ్లాండు రాజ్యాంగ విధానాన్ని అనుసరిస్తూ, దానిని బాగా వంట పట్టించుకున్నారు. ఇంగ్లాండు దేశ పరిపాలనా విధానమే భారత దేశానికికూడా కావాలన్నారు. వారి ఆదర్శం

"ఇంగ్లాండంతా ఒకేజాతి. భారతదేశంకూడా ఏకమై ఒకే జాతిగా లేవాలి." వారు యింగ్లండుకు, భారతదేశానికి, గల భేదాలను గుర్తించలేరు; భారతదేశాభివృద్ధి ఏ మార్గాలలో జరుగుచున్నదో పరిశీలించలేదు. వారిప్రచారమంతా జాతిని నిర్మించుటకై సంఘసంస్కరణలు కావాలని. అందుచే మతం అనవసరమైనదని వారి వాదన. మతాన్ని రాజకీయాలనుండి వేరుచేయడమే వారి సమస్య. ఇందుకు వారివాదన యిది: బ్రిటిషు వారికి మతమంటే ఏమంత పెద్ద సమస్యకాదు. వారికి మతం ఏమీ ఆటంకంగా వుండటం లేదు; అటువంటప్పుడు మతం మనకెందుకు అడ్డంకిగా వుండాలి? ఈ విధంగా బ్రిటిషు పారమెంటును, బ్రిటిషు రాజ్యాంగ చట్టాన్ని పరమావధిగా పెట్టుకున్న యీ భారతీయమితవాద నాయకులు అప్పటి సమస్యను మిక్కిలి సంకుచితదృష్టితో చూశారు.

## సామ్రాజ్యవాదుల సవాల్

కాని, జాతీయోద్యమం ముందుకు నడచినకొద్దీ, రెండు విషయాలు స్పష్టమైనాయి. "భారతదేశం ఒకే జాతికాదు, తనకు తానెట్లా పరిపాలించుకోగలదు"? అని సామ్రాజ్యవాదం మనలను సవాలుజేసింది. రెండోవిషయం: యీ సవాలుకు జాతీయోద్యమం యీ క్రింది జవాబు యిచ్చింది: 1906-1916 వరకు జాతీయోద్యమం భారతదేశమంతా ఒకే జాతి అనీ, అది తనకు తానే పరిపాలించుకోగలదనీ, బల్లగుద్ది చెప్పసాగింది. ఇదే దాని ప్రధాన నినాదమైంది. "బ్రిటిషువారు ఏవిధంగా ఒకజాతికి చెందిన ప్రజలో అదేవిధంగా మనమూ ఒక జాతి ప్రజలమే" అనేది ప్రతి జాతీయవాది యిచ్చిన సర్వసామాన్యమైన జవాబు. బ్రిటిషువారివలె భారతీయులు కూడ ఒకేజాతి కాబట్టి, బ్రిటిషువారికెట్టి ప్రకాస్వామ్య సంస్థ లున్నవో (పార్లమెంటు వాగైరా), మనకూ అటువంటి సంస్థలే కావాలి, అనేది జాతీయోద్యమంయొక్క కోరిక. సామ్రాజ్యవాదం చేసిన సవాలుకు జాతీయోద్యమం యిచ్చినజవాబు: "భారతదేశం ఒకే ఒక జాతి"

## కొన్ని సంకుచిత భావాలు

కాని, యీ వుద్యమంయొక్క స్వభావం వల్ల అందులోనుండి కొన్ని సంకుచిత భావాలుకూడా ఉత్పన్నమైనాయి. ఈ సంకుచితభావాలే ముందు ముందు జాతీయైక్యతకు పెద్ద అడ్డంకుగా పరిణమించాయి. ఈ కాలంలో జాతీయోద్యమం ఎక్కువగా హిందూసాంప్రదాయాలతో నిండి వుంది. నాయకు లందరూ మధ్యతరగతికి చెందిన హిందువులే. కాబట్టి యీకాలపు జాతీయోద్యమంలో హిందూ సిద్ధాంతాలు విరివిగా ప్రచారం చేయబడ్డాయి. భారతదేశమంతా ఒకే జాతి అనే వాదానికి హిందూమత శాస్త్రాలలో 'భరత వర్షే' అన్న నిర్వచనం బలాన్నిచ్చింది. ఈ విధంగా బయలుదేరిన జాతీయోద్యమం క్రమంగా యీ దశను వదలి, యింకా ముందుకు నడచినప్పటికీ హిందూశాస్త్రాల నిర్వచనం, వాటి

వాసన, యింకా అంటుకునే వున్నాయి. నాయకత్వంలో ఎక్కువగా హిందువులుండటంవల్ల జాతీయోద్యమం పై హిందూసాంప్రదాయాలముద్ర గట్టిగా అంటుకుపోయింది. భారతదేశం ఏక ఖండం అనే భావం హిందూ సాంప్రదాయాల వల్ల కలిగిన ఐక్యతే. ఈవిధమైన భావాలు జాతీయోద్యమంలో మిళితమైపోవడంవల్ల, ముందు ముందు ఉద్యమానికి పెద్ద అడ్డంకిగా పరిణమించాయి.

## ప్రజాసామాన్యంలో సంచలనం

రెండవదశ:- యుద్ధకాలంలో సామ్రాజ్యవాదుల యుద్ధావసరాలవల్ల బయలుదేరిన భారతీయ పెట్టుబడిదారీవర్గం అంతకంతకుజాతీయోద్యమంలోముందుకు వచ్చింది. అంతవరకు బ్రిటిషు ప్రభుత్వానికి అర్జీలుపెట్టుకోవడానికి మాత్రమే అవుసరమైన హిందూ-ముస్లిం ఐక్యత (1916 లో లక్నో ఒడంబడిక,) అంతటితో ఒక క్రొత్త రూపాన్ని దాల్చింది. యుద్ధానంతరం ఏర్పడిన ప్రజాచైతన్యంతో పాటు, హిందూ మహమ్మదీయ ప్రజాసామాన్య మంతటిలోనూ సంచలనంబయలుదేరింది. ముస్లిం ప్రజాసామాన్యం నిద్రనుంచి మేల్కొన్నరోజులవి. మధ్య ప్రాచ్యంలో ముస్లిం దేశాల ప్రజలందరూ బ్రిటిషుసామ్రాజ్యంపై ఎదురు తిరుగుతున్నరోజులవి. టర్కీ సామ్రాజ్యాన్ని బ్రిటిషు సామ్రాజ్యం ఛిన్నాభిన్నం చేయడంవల్ల ప్రపంచ ముస్లింలంద రికో గొప్పసంచలనం బయలుదేరింది తూర్పుదేశాల ముస్లింజాతులలోకూడా కలిగిన ఈకద లికఫలితమే ఖిలాఫత్ వుద్యమం. భారతదేశంలో ఈ ఖిలాఫత్ వుద్యమం, జాతీయోద్యమంతో, చేతులు కలిపింది. హిందువులూ, ముస్లింలూ బ్రిటిషు సామ్రాజ్యవాదంతో పోరాడుటకై ఏకమయారు. కాని, యీ పోరాటంలోకూడా అసలు సమస్య పూర్తిగానూ, స్పష్టంగానూ, విశదం కాలేదు. ఎంతవరకూ ఉభయులమధ్య అంగీకారమో, ఎక్కడెక్కడ విభేదాలో గుర్తించబడలేదు. ఈ పోరాటం ప్రజాపోరాటమే అయినప్పటికీ, హక్కులూ, కోర్కెలూ యింకా మితవాద పూరితంగానే వున్నాయి. వాటి స్వరూపంమాత్రం విప్లవకరమైనది. ఐక్యతాసమస్య, జాతీయ స్వాతంత్ర్యం, బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేకత, అనే నినాదాలపై ఆధారపడే సమస్యగానే కనిపించింది. ఈ ఐక్యత ఆయినా, మధ్యతరగతి ప్రజలకుమాత్రమే సంబంధించి వుండేది. ప్రజాసామాన్యాన్ని కదిలించలేదు. ముస్లింలు ముఖ్యంగా యీ వుద్యమంలో పాల్గొనటానికి కారణం మతావేశం. ప్రత్యక్షమైన, స్పష్టమైన, ప్రజాస్వామ్య నినాదాలుకాదు. ఆ కాలంలో బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏకీభావాన్ని ప్రదర్శించిన హిందూ ముస్లిం నాయకుల నినాదాలవల్లనే వారు పోరాటాలలో జేరారు. ఖిలాఫత్, స్వరాజ్యవాదుల ఐక్యతకు కారణం, ఆ బడానాయకులు తమ హక్కులకై సాధించిన ఐక్యతయే. కాబట్టి ఎప్పుడైతే పోరాటం ఆగిపోయిందో, అప్పుడు ఐక్యత విచ్ఛిన్నమైంది. మాంటేగ్-చెమ్స్ ఫర్డు సంస్కరణలు రాగానే, యీ ఐక్యత భగ్నమైంది.

## పెట్టుబడిదారీవర్గపు అభివృద్ధి

ఈ విధంగా పై పై ఐక్యత భగ్నం కావడం, మొదటి దశకు రెండోదశకు మధ్యగల సంధికాలాన్ని సూచించింది. ఇప్పటినుండే క్రమంగాను, నెమ్మదిగాను, అనేక అడ్డంకులను దాటుకుంటూ, పారిశ్రామిక పెట్టుబడిదారీవర్గం అభివృద్ధి చెందుతూవచ్చింది. సామ్రాజ్య వాదులతో పోరాటం ఒక ప్రక్కను, తమలోనే తమకుగల పోరాటాలు యింకొక ప్రక్కను, పెరుగుతూ వచ్చాయి. దీనితోపాటు హిందూ-ముస్లిం ప్రజాసామాన్యాన్ని ఐక్యపరుస్తూ కార్మికోద్యమం అభివృద్ధి చెందుతూ వచ్చింది.

ఈ విధంగా రెండు స్వభావాలతో ఉద్యమం సాగుతూ వచ్చింది. ఒక ప్రక్క పెట్టుబడిదారీవర్గంలోనే రెండు ముఠాలమధ్య పోరాటం; మొత్తం బూర్జువావర్గానికి, సామ్రాజ్యవాదానికీ మధ్య పోరాటం. రెండోప్రక్క, రైతుల వుద్యమం, కూలీల వుద్యమం నానాటికీ అభివృద్ధి చెందుతూ బలపడటం. అభివృద్ధిదాయకమైన యీ రెండవ పోకడయే ప్రజాసామాన్యాన్ని ఐక్యపరుస్తూ పీడితవర్గంయొక్క ఐక్యతకు దారితీసింది.

## పొరపాటు దృక్పథం

ఈ దశయొక్క లక్షణాలుచూచి, హిందూ-ముస్లిం సమస్య కేవలం బూర్జువావర్గంలో గల రెండు ముఠాల మధ్య పోరాటమే నను భావం ఏర్పడింది. "కార్మికులు మాత్రమే తమ కందరికీ సంబంధించిన పోరాటంలో కలియగల్గుతారు. ఇట్టి పోరాటాలు ఆర్థిక పోరాటాలు" అనేది ఆనాటి వాదం. ఆర్థికపోరాటాల ద్వారా మతసమస్యను పరిష్కరించాలని అప్పుడు భావించేవారం. ఈ దృక్పథం పూర్తిగా తప్పుకాకపోయినా, అందులో కొంత పొరపాటు ఉన్నది. సమస్యయొక్క సగంరూపాన్ని మాత్రమే ఇది తెలియజేస్తుంది. బూర్జువావర్గంలో గల అంతర్యుద్ధాలను కార్మికుల ఐక్యతద్వారా, ఇతర ప్రజాసామాన్యం యొక్క ఐక్యతద్వారా,మాత్రమే పరిష్కారం చేయగలమని భావిస్తూ, సగం నిజాన్ని చూచామన్నమాట. ఈ వర్గ సిద్ధాంతపు వివరణ ఆర్థిక పోరాటాలే సోషలిష్టు పోరాటాలు అను మొరటువాదనగా తయారయింది. ఈ సమస్య కేవలం ధనిక, మధ్య తరగతి ప్రజలలో వుండే తగాదాలేననీ, ప్రజాసామాన్యం ఆర్థికహక్కులకొరకై చేయుపోరాటాలే దానికి పరిష్కారమార్గమనీ, స్థూల దృష్టితో చూచాం. ఇట్టి దృక్పథంవల్లనే కాంగ్రెసు సోషలిష్టు పార్టీ 'ఒకఆచరణయోగ్యమైన' కార్యక్రమమంటూ ఒక క్రొత్తసూచన ఇచ్చింది "ముస్లిముల భాషకు, విజ్ఞానానికి, మతం మున్నగువాటికి, హామీలిద్దాం. అప్పుడు సమస్య పరిష్కారమౌతుంది." అని కాంగ్రెసు సోషలిష్టుపార్టీ చెప్పింది. కాని యీ పరిష్కార మార్గానికీ, బూర్జువావర్గం చూపిన "ఆచరణయోగ్యమైన" పరిష్కారమార్గానికీ, భేదం ఏమీలేదు.

## సామ్రాజ్యవాదపు దాడి

ఈ రెండవ దశలో జాతీయోద్యమం నానాటికి బలపడుతున్నకొద్దీ సామ్రాజ్యవాదం దాన్ని భగ్నం చేయడానికీ, చీలదీయడానికీ, అవుసరం యెక్కువయింది. మొదటి సహాయ నిరాకరణోద్యమం విఫలమైనప్పటినుండి రెండవ సత్యాగ్రహంవరకు సామ్రాజ్యవాదం జాతీయోద్యమంపై దాడిచేసింది. (దాదాపు 1924 నుండి 34 వరకు) ఈ దాడి మత కలహాల రూపం దాల్చింది. ఈ కాలంలో జాతీయోద్యమాన్ని, కార్మికోద్యమాన్ని భగ్నం చేయడానికి సామ్రాజ్యవాదం కనిపెట్టిన కొత్త టెక్నిక్ యిదే.

1900 సంవత్సరమునకు పూర్వం కూడా మతకలహాలు వున్నాయి కానివాటి స్వభావం పూర్తిగా వేరు. మతావేశంతో ఒక మతం ప్రజలు రెండవమతం ప్రజలపై జరిపిన దాడులవి. కాని 1924 — 34 కాలంలో మత కలహాలకు యెక్కువ కారణం మతావేశం కాదు. లంచాలుతిన్న తుంటరులే అల్లరికి యెక్కువగా కారణమని చెప్పాలి. ఈ కొత్త మతకలహాలలో సామ్రాజ్యవాదంయొక్క టెక్నిక్ పూర్తిగా కన్పిస్తుంది. ముస్లిం ప్రజలు యిదివరకువలె మత పిచ్చితో పోరాటాలు తీసుకురావటంలేదనీ, అందుచే సామ్రాజ్యవాదం తుంటరులను పురిగొల్పి, వారిని ఉపయోగించుతూ వచ్చిందనీ. స్పష్టంగా మనం తెలుసు కోవచ్చు.

## రెండవ సత్యాగ్రహోద్యమం

రెండవ సత్యాగ్రహోద్యమాన్ని గూర్చి యిక్కడ యెక్కువగా చర్చించ నవుసరం లేదు. ఈ కాలంలో కాంగ్రెసుకు - ముస్లింలీగుకు మధ్య ఎక్కువ తగాదాలులేవు. ముస్లిం లీగు కొంతవరకు తటస్థంగా ఊరుకొన్నది. ఆవేశంతో పరవశులై ప్రజలెక్కువమంది యీ వుద్యమంలోకి ఆకర్షింపబడ్డారు. దీనిని లీగు ప్రత్యక్షంగా వ్యతిరేకించుటకు పూనుకోలేదు

సత్యాగ్రహోద్యమం భగ్నమైన కొన్నాళ్ళకు కార్మిక కర్షకోద్యమాలలో కొత్త వికాసం కలిగింది. ఈ నూతన వికాసమే కొత్తదశకు దారితీస్తుంది.

## కార్మిక, కర్షకోద్యమాలు

మూడవ దశ :— కార్మిక కర్షకోద్యమాల అభివృద్ధి, ఎసెంబ్లీ యెన్నికలలోను, యెన్నికల పిదప, దేశంలో కలిగిన బ్రహ్మాండమైన రాజకీయ సంచలనము, మూడవ దశకు ప్రారంభ చిహ్నాలు. ఇప్పుడు జరిగిన మూడు సంఘటనలు ముఖ్యమైనవి. ఇంతవరకు అనేక ఆటంకాలు కల్పింపబడ్డా, పారిశ్రామికాభివృద్ధి క్రమంగా యెక్కువయింది. ఈ అభివృద్ధి అన్ని పరిశ్రమలలోను గాక, యే కొద్ది పరిశ్రమలు స్థాపించబడ్డాయో వాటిలోనే యెక్కువగా కనబడుతుంది. దీనినే పరిశ్రమలు నిలువుగాకాక, అడ్డంగా పెరుగుట యంటాము. అంటే, కొత్త కొత్త పరిశ్రమలు దేశమంతటా యెక్కువగా ప్రారంభింపబడి, అభివృద్ధి పరచబడకపోయినా, అభివృద్ధి అయిన కొద్ది పరిశ్రమలు దేశమంతటా వ్యాపించట ;

పరిశ్రమలు లేని నూతన ప్రదేశాలకు కూడ అవి వ్యాపించడం, జరిగింది. దీనినే పరిశ్రమలు అడ్డంగా పెరగటం అంటాము. (ఉదా :— మోటారు, విమానాలు, నౌకా నిర్మాణం మొదలైన పరిశ్రమలు మన దేశంలో స్థాపించబడలేదు. కాని, ప్రారంభించబడ్డ బట్టల పరిశ్రమ, గోనెసంచుల పరిశ్రమ, పంచదార పరిశ్రమ మొదలైనవి దేశం నలుమూలలకు ప్రాకినాయి దీనినే అడ్డంగా వ్యాపించటం అంటాము.) ఇదివరకు పరిశ్రమలే లేని ప్రదేశాలలో కూడా ఈ పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. ఈ విధంగా పరిశ్రమలు అడ్డంగా పెరగటం వల్లనే అనేక ఘర్షణలు, బూర్జువా వర్గంలో వివిధ ముఠాలకు మధ్య పోటీలు, యేర్పడ్డాయి. ఇది మొదటి విషయం. రెండవ విషయం : దేశంలో కార్మిక కర్షకోద్యమం తీవ్రమయింది. మూడవ విషయం : నూతన రాజ్యాంగచట్టం ఆచరణలో పెట్టబడింది. వెంటనే బూర్జువా వర్గం యొక్క వివిధ ముఠాలు, వివిధ పార్టీలు నిశ్చితమైన రాజకీయ పంథాలను అనుసరించ వలసిన అవసరం యేర్పడింది.

## కాంగ్రెసు మంత్రుల హయాం

కాంగ్రెసు మంత్రుల హయాంలోను, అటు పిమ్మట, కూడా బూర్జువా వర్గంయొక్క వివిధ ముఠాల మధ్య, వివిధరాష్ట్రాల బూర్జువావర్గాల మధ్య ద్వేషాలు, పోటీలు, ఘర్షణలు అధికమయాయి. ప్లాను లేకుండా "అడ్డంగా" అభివృద్ధిచెందే పారిశ్రామిక విధానం దేశంలో ఎగుడుదిగుడుగా, అడ్డదిడ్డంగా, అభివృద్ధి చెందుతుంది. పారిశ్రామికంగా ఇంతవరకు వెనుకబడ్డ ప్రదేశాలు హఠాత్తుగా పారిశ్రామిక పోటీకి దిగుతాయి. 1937 నాటి ఎసెంబ్లీ ఎన్నికల కాలంలోను, అటు పిమ్మటను బయల్దేరిన "అంతరరాష్ట్రీయ తగాదా"లకు ఇదే కారణం. "సంయుక్త కర్ణాటక" నినాదం, ఆంధ్రరాష్ట్ర నినాదం, ఒరియాలకు వారి ప్రత్యేక హక్కులు కావాలనే వాదం, బెంగాలు బీహారు తగాదాలు, ఇవన్నీ బహిర్గతమయాయి. ఉదాహరణకు, కర్నాటకంలో లింగాయతు లనేవారున్నారు. అప్పటివరకు వారు రాజకీయంగా వెనుకబడ్డవారు. కాని 1937 ఎసంబ్లీ ఎన్నికలలో వారికి గల్గిన రాజకీయ చైతన్యంవల్ల, తమ కులం తరపుననే అభ్యర్థులను నిలబెట్టారు. ఆ అభ్యర్థులు ఇదివరకే కాంగ్రెసు అభ్యర్థులుగా వున్నప్పటికీ, లింగాయత్ కులానికి యెక్కువ ప్రాధాన్యత వచ్చింది. వారి ప్రత్యేక హక్కులకు ఎంత ప్రాముఖ్యత వచ్చిందంటే, కాంగ్రెసు సంస్థలోనే తగాదాలు ప్రతిబింబించాయి. కర్ణాటక యెన్నికలలో లింగాయతులు తమ కులం తరపుననే కాంగ్రెసు అభ్యర్థులను నిలబెట్టటంవల్ల కాంగ్రెసు నాయకత్వంలో పరస్పర విభేదాలు ఎంత తీవ్రంగా వుండేవో తెలుస్తుంది. అంతవరకు కర్ణాటక కాంగ్రెసులో పెత్తనం చలాయిస్తున్న మహారాష్ట్ర బ్రాహ్మణుల (భూస్వాములు, వడ్డీవ్యాపారకులు) ముఠాకున్నూ, అప్పుడే ప్రాముఖ్యంలోకి వస్తున్న లింగాయతు మధ్యతరగతి (వ్యాపారస్తులు) ముఠాకున్నూ, కల్గిన విభేదాలు యివి. కాని విభేదాలకు

రెండు స్వరూపాలున్నాయి. ఒకటి: బూర్జువా వర్గంలోనే రెండు ముఠాల మధ్య తగాదాలు. రెండు: లింగాయతు రైతాంగము, మొట్టమొదటిసారిగా రాజకీయ చైతన్యాన్ని పొంది, పోరాటరంగంలో ప్రవేశించుట. ఈ రెండవ స్వరూపమే యీ దశలో అంత కంతకూ ప్రధాన పాత్రను ధరించుతూ, జాతీయైక్యతా సమస్యను కొత్త విప్లవమార్గాన్ని బట్టించింది ఈ కొత్త పోకడపైనే యిప్పుడు మన దృష్టిని కేంద్రీకరించాలి.

## బూర్జువా ముఠాలలో అంతర్విభేదాలు

జాతీయోద్యమం అభివృద్ధి జెందినకొద్దీ బూర్జువావర్గంలో వున్న పైముఠాలమధ్య విభేదాలు నూతన రూపాలు పొందుతాయి. ఈ కొత్త రూపాలేమిటి? వాటి స్వభావం ఏమిటి? వీటిని మనం సరిగా గుర్తించి, చక్కగా అర్థం చేసుకోవటంవల్లనే యీ దశలో జాతీయైక్యతా వినాద యొక్క మూలసూత్రాన్ని తెలుసుకొన గల్గుతాము.

జాతీయోద్యమం కేవలం మధ్యతరగతి ప్రజలతోనే సంబంధం వున్నంతకాలం యీ సమస్య బ్రిటిషు సామ్రాజ్యవాదానికి, భారతదేశ ప్రజలకు మధ్యజరిగే పోరాటంగా మాత్రమే వృద్ధి చెందింది. కాని రాజకీయ రంగంలో రైతాంగం ప్రవేశించగానే యీ సమస్య క్లిష్టమౌతుంది; అనేక రూపాలను దాలుస్తుంది. జాతీయైక్యత అంటే దేశంలో వున్న వివిధ జాతులమధ్య ఐక్యత యని క్రమంగా అర్థమౌతుంది. బ్రిటిషు సామ్రాజ్య వాదానికి, ఐక్య భారత దేశానికి మధ్యగల తగాదామాత్రంగానే యీ సమస్యను తేల్చలేము. ప్రధానమైన యీ పెద్ద సమస్యలోనే లీనమై మరొక సమస్య వుంది. ఇదే భారత దేశంలో వున్న వివిధ జాతుల సమ్మేళనం. చైతన్యం పొందుతున్న వేర్వేరు జాతుల ఐక్యత ఈ కాలంలో ప్రధాన సమస్యగా పరిణమించింది. భారతదేశ ప్రజలకు, బ్రిటిషు ప్రభుత్వానికి మధ్యగల సమస్యను పరిష్కరించడానికి, యిది ప్రథమ సోపానముగ బయలుదేరింది.

## వివిధ జాతుల సమ్మేళనం

ఈ ఐక్యతా సమస్య మనలను నేడు వివిధ జాతుల సమ్మేళనం అనే క్లిష్ట రూపంతో ప్రత్యక్షంగా యెదుర్కొంటూంది. ఈ దశలో దీని క్లిష్టత అంతకంతకు యెక్కువ అవుతుంది. ప్రస్తుత పరిస్థితులతో దాని ప్రాముఖ్యతను అవగాహన చేసుకోవాలంటే, మనం దాని మూలకారణాలను కనుక్కోవాలి. దానిలో చెడుగును కలిగించేస్వభావాన్ని, అభివృద్ధికి-ఐక్యతకు కారణమైన స్వభావాన్ని గుర్తించాలి. మనం సరియైన పరిష్కార మార్గాన్ని ఆలోచించాలంటే, వర్తమానంలో ఏంజరుగుతూవుందో కనుగొనడమే గాకుండా భవిష్యత్తులోగూడ యీ సమస్య యేవిధంగా పరిణమిస్తుందో తెలుసుకోవాలి. అటువంటి పరిష్కారమార్గమే భవిష్యత్తులో అవిచ్ఛిన్నమైన ఐక్యతకు దారి తీయగలదు.

1935 – 39 కాలంలో జాతీయోద్యమం విస్తారంగా వ్యాపించి, అంతవరకు రాజకీయాలతో సంబంధం లేని ప్రాంతాల నన్నింటినీ కదల్చివేసింది. ఇందు మూలకంగా రైతాంగమూ, యితర ప్రజా సామాన్యము మొట్టమొదటిసారిగా రాజకీయాలంటే యేమో, జాతీయత అంటే యేమిటో తెలుసుకున్నారు. చాల రాష్ట్రాలలో రైతాంగము తమ ప్రాంతీయ అభిమానాన్ని విడిచిపెట్టి, జాతీయసమస్యలపై దృష్టి కేంద్రీకరించు స్థితికి వచ్చింది. కాని యీ జాతీయ దృక్పథం వారి వారి ప్రాంతీయ అభిమానం ద్వారా, భాషాభిమానం ద్వారానే కలిగింది. ఉదాహరణకు, కర్ణాటకులను తీసుకుందాం. లింగాయతు రైతాంగములో నిజానికి అఖిల భారత దృక్పథం యేర్పడింది. కాని ఈ దృష్టి వారికో తమ లింగాయతు భాషద్వారా, సాంప్రదాయాలద్వారా అలవడింది. భాషాప్రయుక్త రాష్ట్రాలద్వారా కాంగ్రెసు యీవరకే యీ ప్రధాన సూత్రాన్ని అంగీకరించి నది కాంగ్రెసుచే నడుపబడు జాతీయోద్యమం ఒక్కొక్క రాష్ట్రానికి వ్యాపించుతున్నకొద్దీ, ఆ యా ప్రత్యేక రాష్ట్రాల స్వరూపం, స్వభావం అందులో ప్రతిబింబించబడ్డాయి. ఒక పెద్ద ప్రవాహం ఒక రాష్ట్రంనుండి మరొక రాష్ట్రానికి పోతుంటే, ఆ యా ప్రదేశాల మట్టి రంగు ప్రవాహంలో కనబడుతుంది. ఇలాగే దేశ వ్యాపితమైన జాతీయోద్యమం కూడా వివిధ రాష్ట్రా లలో వృద్ధిచెందింది. ఇది ఒకే ప్రవాహ మైనప్పటికీ, వివిధ లక్షణాల సమ్మేళనం అని చెప్పవచ్చు.

కాని, రైతాంగాన్ని, ప్రజా సామాన్యాన్ని, జాతీయోద్యమం ఆకర్షించినపుడే తప్పని సరిగా ఈ మార్పు కల్గుతుంది. కనుకనే స్టాలిన్ "జాతీయ సమస్య యెక్కువగా రైతాంగ సమస్య" అన్నాడు. ఆ యా భాషాప్రయుక్త ప్రాంతాల ప్రజలు తమ రాష్ట్రీయ చైతన్యం ద్వారా అఖిల భారత జాతీయ చైతన్యాన్ని పొందగల్గుతున్నారు. దేశ వ్యాపిత జాతీయోద్య మం, అఖిల భారత జాతీయ చైతన్యం, ఆ యా భాషాప్రయుక్త ప్రాంతాల ప్రత్యేక చైత న్యాన్ని రగుల్కొల్పుతుంది. ఈవిధంగా రెండూ ఒకదానిపై మరొకటి ఆధారపడివుంటాయి. ప్రజా సామాన్యం ఒకదానిద్వారా రెండవది సంపాదించుకోవడానికి యివి మార్గాలు. జాతీ యోద్యమం రైతాంగంలో చొచ్చుకుపోయినపుడే వివిధ జాతుల రమణీయ సమ్మేళనం యేర్పడుతుంది. "జాతీయ సమస్య ప్రధానంగా రైతాంగ సమస్యయే" అన్న స్టాలిన్ స్టేటు మెంటులో మహదార్థ మిదే.

ఈ విధంగా ప్రజాసామాన్యం ఒక ప్రక్క అఖిల భారత రాజకీయ చైతన్యాన్ని, యింకో ప్రక్క వివిధజాతుల రూపాన్ని, ధరించి అభివృద్ధి పొందుతూ వుంటుంది. ఈ రెం డున్నూ, ఒకదానిపై మరొకటి ప్రభావం కల్గియుండి, పరస్పరం మారుతూ, అభివృద్ధి చెందు తాయి. ఈదశలోని ఘర్షణలలో, తగాదాలలో, అభివృద్ధిదాయకమైన పోకడ యిదే.

ఇక అభివృద్ధి నిరోధకమైన లక్షణాలకు ఉదాహరణ : బెంగాలు - బీహారు తగాదాలవంటి బూర్జువావర్గపు పోటీలు.

ఈ పరిణామం జాతీయోద్యమంలో వివిధజాతుల చైతన్యం యెలా పరిపక్వ దశకు వృద్ధిచెందుతుందో సూచిస్తుంది. అందుచే యిదివరకుపలె భాష, నాగరికత మున్నగు హక్కులకు గ్యారంటీ చేసినంతమాత్రాన సమస్యాపరిష్కారం కాదు. ఈ సమస్యకు మూలం వివిధజాతుల ప్రజలు వేర్వేరుగా, సంపూర్ణంగా, స్వేచ్ఛగా, ఎట్టి అభ్యంతరములు లేకుండా, అభివృద్ధిచెందుటకు చూపుతూన్న తహ తహ. ఈ నూతన పరిస్థితులలో ఏ ఆటంకాలు లేకుండా ప్రతి జాతి వికసించాలంటే,రాజకీయంగాను, ఆర్థికంగానుకూడ, అభివృద్ధి చెందాలన్నమాట. ఈవిధంగా సర్వతోముఖమైన ఆర్థిక, రాజకీయాభివృద్ధికావాలనే ప్రతిజాతీ అంకుతైప్రయత్నిందంద్వారానేసామ్రాజ్యవ్యతిరేకత వారిలో బలపడుతుంది. తాము బ్రిటిషు సామ్రాజ్యవాదంనుండి విడివడాలనే కాంక్ష తమ తమ ఆర్థిక హక్కుల్ని సాధించడంద్వారా మాత్రమే సఫలమవుతుంది. ఈవిధంగా ప్రతిజాతి ఆర్థిక, రాజకీయ అభివృద్ధికి స్వేచ్ఛనుకలిగివుండడమే జాతీయ స్వయంనిర్ణయ సూత్రం అంటున్నాము. ఈనినాదంద్వారా మనం అఖిలభారత సమస్యను పరిష్కరించడంలో, అన్నిజాతులప్రజలు చేయిచేయికలిపి ముందుకువచ్చేటట్లు వారిని సమీకరించగల్గుతాము. ఈ నినాదం అభివృద్ధికరమగు ఒక సాధనంగా వుపయోగపడుతుంది. ఈనినాదంద్వారాప్రతిఒక్కజాతి పూర్తిగా అభివృద్ధిచెందుటకు చక్కని అవకాశ మేర్పడుతుంది. భిన్నత్వమే ఐక్యతను బలపర్చుతుంది. ప్రతి జాతి బలపడుతూ, అభివృద్ధి పొందడానికి పై నినాదం ఒక సాధనంగా వుపయోగిస్తుంది.

## కమ్యూనిస్టు పంథా

కమ్యూనిస్టులకు పై పరిణామం సులభంగానే అర్థమవుతుంది. కాని సామాన్య దేశభక్తులకు సులభంగా అర్థంకాదు. హిందూ-ముస్లిం సమస్యయొక్క ఈ నూతన పోకడ వివిధజాతుల రాజకీయ చైతన్యమేనను సంగతిని వారు గ్రహించలేకున్నారు. కమ్యూనిస్టులమైన మనం సిద్ధాంతంయొక్క, ఆదర్శాలయొక్క, సహాయంతో మన పంథాలను నిర్ణయించుకోగల్గుతున్నాము. వీటి సహాయంతోనే మనం క్రొత్త లక్షణాలు, భవిష్యత్తులోయే విధంగా అభివృద్ధి పొందగలవో, తెల్సుకుంటున్నాము. జాతీయోద్యమాభివృద్ధికి మనం యిచ్చే నినాదాలు, యీ నూతన పోకడలకు, వాటిఅభివృద్ధికి, ఆటంకంగా వుండక, ముందు జరుగబోవు అభివృద్ధికి సహాయకరంగా వుండాలి.

అందుచేతనే ఈ మతసమస్యయొక్క నూతనదశలో ఏ యే పోకడలు, ఏ యే మూల సూత్రాలు, వున్నాయో వాటిని అర్థంచేసుకోవడం అవుసరం.

## మంతెనవారిపాలెం తీర్మానం

ఈ సత్యాన్ని తెలుసుకొంటూ మనపార్టీ చాలకాలం మార్గాన్వేషణలోనే వుంది. 1938 లో మంతెనవారిపాలె లో మనంచేసిన తీర్మానం ఈమార్గంలో మొదటిమెట్టు. కాంగ్రెసు-లీగు ఐక్యతయే జాతీయ ఐక్యతకు పునాది అని అప్పటికి గ్రహించినది మన మొక్కరమే. కాంగ్రెసు-లీగు ఐక్యతకై రాయబారములు సాగించాలని వత్తిడి చేసినదికూడ మన మొక్కరమే. ముస్లిం ప్రజాసామాన్యంలో వస్తున్న మార్పును గుర్తించినదికూడ మనం ఒక్కరమే. కాంగ్రెసు సోషలిష్టుపార్టీ, యితర సంస్థలు, యీ సత్యాన్ని గుర్తించలేదు. వారింకా పూర్వపుధోరణిలోనే "ముస్లిం ప్రజాసామాన్యం మనవైపు మొగ్గుతూంది. లీగ్ నాయకత్వం ఒంటరిగా దూరమైపోతుంది" అనే మంత్రం వల్లిస్తూ వచ్చారు.

## ముస్లింలీగుకు బలం

ముస్లింలీగులో, ఈకాలంలో, కల్గినమార్పులు ఏమిటి? ఎసెంబ్లీ ఎన్నికలలో, ముస్లిం మేధావులు కొందరు కాంగ్రెసు పక్షంతో చేరి, దానిని బలపర్చారు దానికి కారణం, కాంగ్రెసు తీవ్రంగాచేసిన ఎన్నికలప్రచారం. కాంగ్రెసు ప్రత్యర్థులకు పోటీగానిలచి లీగుఅభ్యర్థులు ఎక్కువ విజయాన్ని పొందలేదు. కాని, ఎన్నికల అనంతరం సంయుక్తమంత్రివర్గాలను స్థాపించకపోవడం, కొన్ని కాంగ్రెసురాష్ట్రాలలో జరిగిన పొరపాట్లు, యివన్నీ జిన్నాకు వుపయోగపడ్డాయి. చిన్నచిన్న లోపాలను సాకుగాతీసుకొని, జిన్నా ముస్లిం ప్రజాసామాన్యాన్ని ఆకర్షించి, లీగులో సమీకరించగల్గాడు. జాతీయనాయకత్వంలో తీవ్రవాదులు యీ నూతన పోకడను గుర్తించ లేక, ఈ సమస్యలోని ఒక భాగాన్ని మాత్రమే చూచారు. వారు చెప్పేది, "అభివృద్ధి నిరోధకమైన లీగునాయకత్వం, ముస్లిం ప్రజాసామాన్యంయొక్క అజ్ఞానాన్ని, తమ స్వలాభాలకై వినియోగించుకుంటూ వుంది," అని. దానికి పరిష్కారమార్గంగా, "ప్రజాసామాన్యంతో సంబంధం ఎక్కువ పెట్టుకోవడమే" అనేవారు. (Mass contact)

## అభివృద్ధిదాయకమైన పోకడ

కాని కమ్యూనిష్టులమైన మనం, రెండవస్వరూపాన్ని కూడా చూడగల్గాము. రెండు ముఖాలలోని బూర్జువావర్గాలమధ్య పెరుగుతూ వచ్చిన పోటీని మనం చూశాము. కొన్ని రాష్ట్రాలకు (ఉదా: యు. పి.) ప్రత్యేక సదుపాయాలు కావాలి; సంస్కరణలు కావాలి అనేరూపంతో ఈ పోటీస్పష్టంగా బైటపడింది. కాని, దీనిప్రక్కనే అభివృద్ధిదాయకమైన పోకడను కూడా చూశాము. ఆ పరిస్థితులలో, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, ముస్లింలు

అజ్ఞానులుగా వున్నారని కాక, వారిలో కల్గుతూన్న రాజకీయ చైతన్యాన్నీ, వారిఅభివృద్ధి కరమైన చురుకుదనాన్ని, మనం గుర్తించాము. వారు తమ ప్రత్యేకజాతుల అభివృద్ధిని దృష్టిలోపెట్టుకొని జాతీయోద్యమంలో పాల్గొంటున్నారని గ్రహించాము వారి చైతన్యం వృద్ధి చెందటమంటే, జాతీయచైతన్యం వృద్ధిచెందడమని గ్రహించాము. నిజానికి వారిసామ్రాజ్య వ్యతిరేక జాతీయచైతన్యం వారివారి జాతీయ జీవిత వాంఛలో ప్రతిబింబిస్తోంది. ఇది అభివృద్ధికరమైన పోకడ. లీగుకు, కాంగ్రెసుకు, సఖ్యతచేకూర్చి ప్రజాస్వామ్య హక్కుల విషయంలో రెండుసంస్థలను ఐక్యపర్చగల్గితే, ముస్లింజాతులుపొందిన సంచలనం అభివృద్ధికరమైన మార్గంలో నడిపించగలమనీ, సామ్రాజ్యవ్యతిరేక ఐక్యతను వారిలో ఇంకా బలపరచగలమనీ, తెలుసుకున్నాము.

ఈ విధంగా అంతకంతకు వృద్ధిచెందుతూవున్న ముస్లిం జాతీయచైతన్యం, విశిష్టమైన ఒక రూపంలో పరిణామం జెందుతూవున్నదని మనం గుర్తించినా, దాని మూలం ఏమిటో, ప్రధానకోర్కెలు ఏమిటో, స్వలాభపరులవల్ల ఏ విధమైన కృత్రిమ రూపం దానికి యివ్వ బడుతూన్నదో, మనం గుర్తించలేకపోయాము.

## 1941 పార్టీ లేఖ

1941 మేలో ప్రకటించబడిన పార్టీ లేఖవల్ల మనం యింకా ముందుకు పోయాం. భారతదేశమంతా ఒకే ఐక్యఖండమని 1938 లో మనము వాదించేవారము. మన పార్టీ సభ్యులు యీ సమస్యను చైతన్య రహితమైనట్టి, చారిత్రక దృష్టిలేని, పద్ధతిలో పరిశీలించేవారు. "చారిత్రిక పరిణామములో వివిధ జాతులు ఉద్భవించి వృద్ధిపొందుతాయి" అనే మార్క్సిస్టు సిద్ధాంతము మన దృష్టి పథములో లేనేలేదు. మన ఆలోచనలు యింకా పాతధోరణిలోనే, పాతదృక్పథం ప్రకారమే, సాగుతూ వచ్చాయి. అందుచేతనే కొంతమంది పార్టీ సభ్యులు, 1941 మే పార్టీలేఖకు ప్రత్యామ్నాయ ముగా, కామ్రేడ్ పామీదత్తు "నేటి భారతదేశము"ను ఉదహరించేవారు. కామ్రేడ్ దత్తు యీ సమస్యకు సంబంధించిన భాగాలను 1937 లో వ్రాశాడు. ఆనాటి పరిస్థితులను గురించి, ఉద్యమాన్నిగూర్చి, మాత్రమే అతడు వ్రాశాడుగాని, భవిష్యత్తులోకి అతడు పోదలచుకోలేదు. అతని ప్రయత్నమంతా, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి భారతదేశమంతా వ్యతిరేకంగా ఉన్నదని చూపుటకే. ఈ వుద్దేశానికిమించి యిక ముందు జాతీయ రంగములో ఏ యే మార్పులు జరుగగలవో సూచించుట అతని వుద్దేశ్యముగాదు.

## కామ్రేడ్ స్టాలిన్

మన పార్టీ సభ్యులలో యీ సమస్యనుగూర్చి యిన్ని సందేహాలు, తప్పు అభిప్రా యాలు, కలిగియుండుటకు ముఖ్యకారణం, జాతి అంటే చైతన్యరహితమైన, చారిత్రక దృష్టి

లేని, ఉద్దేశాలను కలిగియుండుచే. "చారిత్రకంగా జాతి, పెట్టుబడిదారీ విధానముయొక్క అభి వృద్ధివల్లనూ, దాని పరిణామంలోనూ, ఉద్భవిస్తుంది." అన్న వాక్యముతో కామ్రేడ్ స్టాలిన్ తన 'జాతీయసమస్య' అనే వ్యాసాన్ని ప్రారంభించాడు. జాతికి సంబంధించిన ప్రధాన సూత్రాన్ని అతడు యీ వాక్యములో వివరించాడు. భారతదేశము ఎల్లప్పుడు ఒకే జాతి అనే వాదన సరియైనదికాదు. మార్క్సిస్టు సిద్ధాంతానికి ఇది వ్యతిరేకం. జాతీయోద్యమము శైశవావస్థలో, ఉన్నప్పుడు ఆనాటి జాతీయవాదులట్టి దృక్పథము కలిగియుండుట సహజమే. కాని ఈనాడు కూడా యింకా ఆ విధంగానే వాదిస్తే, మధ్య కాలములో జరిగిన యీ చారిత్రక పరిణామాన్ని, ప్రస్తుత పరిస్థితుల నిజరూపాన్ని, గుర్తించకుండా కళ్లుమూసుకొని వాదిస్తున్నామన్నమాట.

నిజానికి మార్క్సు భారతదేశ సమస్యయొక్క మూలాన్ని కనుగొన్నాడు. "బ్రిటిషు ఆక్రమణతో భారతదేశంయొక్క ఐక్యత, అనగా నేటి అర్థములో వాడబడే ఐక్యత, ఏర్పడడానికి పునాదులు వేయబడినాయి" అని అతడు వ్రాసినాడు. మన దేశ ప్రజలను దోచుకోవడం ద్వారా యివి వేయబడినాయి. చారిత్రకంగాను, పరిస్థితుల కనుగుణ్యంగాను, ఏర్పడిన యీ ఐక్యతనే చారిత్రక పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొనకుండ, చిరకాలమునుంచి ఉన్నదని ప్రజలు భావిస్తున్నారు. కాని యీ అర్థములోనే భారతదేశ ఒకే జాతి అవునా కాదా, అనే చర్చ తప్పు. ఇది సందర్భ యుక్తంగాదు. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంద్వారా జాతీయయోద్యమంలో ఐక్యత ఏర్పడి, బలపడింది. యీవిషయమే జాతీయఐక్యతపై ప్రభావాన్ని కలిగించింది. యీ వైఖరినే కామ్రేడ్ పామీదత్తు 'నేటి ఇండియా'లో స్పష్టపరిచాడు. బ్రిటిషు సామ్రాజ్యవాదముతో సమిష్టిగా భారతదేశ ప్రజలందరు పోరాడుటయే యీ వైఖరికి ప్రత్యక్ష రూపం. ఇది సామ్రాజ్య వ్యతిరేకతను మాత్రమే సూచిస్తుంది. కాబట్టి "ఇంగ్లండువలె, జర్మనీవలె, భారతదేశంకూడా ఒక జాతి" అనే వాదన ఆధార రహితమైనది. ఈ అర్థంలో పామీదత్తు వ్రాయనేలేదు.

## వివిధ జాతులు పెట్టుబడిదారీ విధానంలోనే బయలుదేరుతాయి

జాతి అంటే చలనరహితమైన భావంకాదు. పెట్టుబడిదారీ విధానం ఉద్భవించి పెరగటంలో, దాని చారిత్రిక పరిణామంలో, జాతులు ఉత్పవించినాయి. జాతులు (స్టాలిన్ నిర్వచనం ప్రకారం వాటి వాటి ప్రత్యేక లక్షణాలు కలిగినవి) బూర్జువా ప్రజాస్వామిక విప్లవ కాలంలో భూస్వామ్యయుగం అంతరించిపోతూ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందేకాలంలో, బయలుదేరుతాయి. పెట్టుబడిదారీ ఆర్థిక విధానం వ్యాపించినకొద్దీ 'జాతీయ' చైతన్యం కల్గి, ప్రత్యేక లక్షణాలతో వివిధ జాతులు బయలుదేరుతాయి. అమ్మకంకోసమే సరుకులు ఉత్పత్తికావటం,

ప్రపంచమంతా ఒకే మార్కెట్టుకావటం, డబ్బు చలామణీలోకి రావటం, ఇవన్నీ పెట్టుబడిదారీ ఆర్థిక విధానపు లక్షణాలు. ఈ ఆర్థిక విధానంవల్లనే జాతులు విశిష్టతను పొంది, అభివృద్ధిజెంది, ఉత్పత్తి పద్ధతుల్ని మరింత ముందుకు తీసుకుపోతాయి.

ఒక్కొక్క దేశంలో ప్రత్యేక చారిత్రక లక్షణాలనుబట్టి జాతులు వివిధ రూపాలతో అభివృద్ధి చెందుతాయి. పెట్టుబడిదారీ విధానంవల్ల అనేక తెగలు (tribes) కలిసి, ఒక ప్రత్యేక జాతిగా ఏర్పడ్డ ఉదాహరణలు ఉన్నాయి. ఇంగ్లాండు, జర్మనీలు ఒకే భాష, ఒకే మానవజాతి (Race) మొదలైనవాటిపై ఆధారపడి, ప్రత్యేక జాతులుగా అభివృద్ధి చెందటం చక్కని ఉదాహరణలు. వివిధ జాతులు (nations) అభివృద్ధిలో మరియొక రూపాన్ని ధరించిన చారిత్రక ఉదాహరణలు కూడా ఉన్నాయి. పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి, వివిధ తెగలు (tribes) కలిసి-వివిధ జాతుల సమ్మేళనం (multi-national state) గా ఏర్పడుతాయి. దానికి ఉదాహరణలు: జారు కాల నాటి రష్యా, యుద్ధానికి పూర్వం ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యము మొదలైనవి. ఇది ఈక్రిందివిధంగా సంభవించుతుంది: పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందేకాలంలో ఒకజాతి ఇతరజాతులకంటె వేగంగా అభివృద్ధిజెంది, ఆధిపత్యాన్ని సంపాదించుతుంది. ఆ దేశంలోనే వున్న ఇతర జాతులు యింకా పూర్తియైన జాతులుగా వికసించవు. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి జెందుతున్నకొద్దీ, వాటి హక్కుల్నీ, అభివృద్ధినీ, పెత్తనం వహిస్తున్న జాతి అడ్డగిస్తున్నట్లు, అణచుచున్నట్లు, ఇవి తెలుసుకుంటాయి. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి జెందుతూవున్నకొద్దీ వివిధజాతుల సమ్మేళనంలో తగాదాలు ఎక్కువౌతాయి. ఇవి స్వతంత్ర జాతీయచైతన్యాన్ని పొందుతాయి. ఈజాతులు అభివృద్ధిచెందుతూ, తమ తమ ప్రత్యేక రాజకీయ ఆర్థిక హక్కులకై ఆందోళన ప్రారంభిస్తాయి.

1911-12 నాటి రష్యాపరిస్థితి యిది. అప్పటి జాతీయ సమస్య ఆకాలంలో రష్యన్ సోషల్ డెమాక్రెటిక్ లేబరుపార్టీని ఎంతో తీవ్రరూపంలో ఎదుర్కొంది. అప్పటికి రష్యాలో అన్నిజాతులు సంపూర్ణంగాను, సమానంగాను, వికసించియుండలేదు. కాని, ఈ పోకడ మాత్రం స్పష్టంగా కనిపించింది. స్టాలిన్ తన పుస్తకంలో దీన్నిగురించి బహుస్పష్టంగా వివరించాడు. ఇరుగు పొరుగున వున్న వివిధజాతులు అంతకంతకు అభివృద్ధి చెందుతూన్నకొద్దీ, అప్పటి ప్రజలుప్రత్యేక హక్కులకై ఆందోళన చేయసాగారు. జాతీయోద్యమం తీవ్రమౌతూన్న రోజులు అవి. ఈకాలంలో పెట్టుబడిదారీవిధానంయొక్క అభివృద్ధితోపాటు, వివిధజాతులుకూడా ఏవిధంగా అభివృద్ధిచెందుతూ, క్రొత్తజాతులు బయలుదేరుతూ, రాజకీయ రంగంలో ఏ విధముగా విప్లవ మార్గాలను ప్రవేశపెడతాయో, చెప్పడానికి రష్యా చక్కని వుదా

హరణ. ఈపోకడలో చీలికలను కలిగించే లక్షణాన్ని మాత్రమే మెన్షివిక్కులుగ్రహించారు. బోల్షివిక్కులు మాత్రం ఇందులో అభివృద్ధికరమైన లక్షణాన్ని గ్రహించి, వివిధ జాతులకు చెందిన ప్రజాసామాన్యంలో తీవ్రంగా పనిచేసి, కార్యరంగంలో వారిఐక్యతను విప్లవమార్గాన నడిపించారు. ఈ విధంగా మనం వివిధ జాతులుగల ఒకే దేశంలో కొత్తజాతులు పుద్భవించడం, అచటి ప్రజలు చైతన్యం పొందడం చూడగలం. చారిత్రకాభివృద్ధిలో నిద్రపోతున్న కొన్ని జాతులు, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మేల్కొని, క్రమక్రమంగా బలం చేకూర్చుకుంటాయి - అనేక కొత్త సమస్యలు అప్పుడు ఏర్పడతాయి. కాబట్టి, జాతి - అంటే ఒక చలనరహితమైన భావంకాదు. మనం అలా తలిస్తే, చారిత్రకాభివృద్ధిని, నిజపరిస్థితుల్నీ చూడక, అంధులమగుచున్నామన్నమాట.

## భారతదేశంలో వివిధ జాతుల అభివృద్ధి

ఇక మన దేశంవిషయ మాలోచిద్దాం. బ్రిటిషు పరిపాలనకు పూర్వం, పూర్తిగా అభివృద్ధిచెందని, నిద్రాణమైవున్న, జాతులెన్నో మన దేశంలో వుండేవి. బ్రిటిషు పరిపాలన ఫలితంగా, మనదేశపు ఆర్థిక వ్యవస్థ పూర్తిగా నాశనమయింది. దానివల్ల ఏర్పడిన అసంతృప్తి ఫలితంగా, క్రమ క్రమంగా జాతీయాభివృద్ధి ప్రారంభమైంది. బ్రిటిషు ఆక్రమణకు పూర్వం భారతదేశంలో ప్రతిగ్రామం ఆర్థికంగా స్వయంపోషకమై యుండేది. నేటి నిర్వచనం ప్రకారం, అనగా బూర్జువా సూత్రాల ప్రకారం, జాతులని పిలువబడేవి అప్పుడులేవు. ఐతే, బ్రిటిషు పరిపాలనలో జాతీయాభివృద్ధి ఏ విధంగా ప్రారంభమైంది? ఇది ఎక్కువ తక్కువ స్థాయిలలో, అసమాన దశలలో, క్రమంగా, కలిగింది. ఈ అసమాన జాతీయాభివృద్ధి పెట్టుబడిదారీ విధానానికి పూర్వమే, అనేక చారిత్రక భౌతిక కారణాలవల్ల, ప్రారంభమైంది. కాని, సామ్రాజ్యవాదం అవలంబించిన విధానంవల్ల యిది వేగంగా జరిగింది. సామ్రాజ్యవాదపు దోపిడీ విధానంవల్లను, అడ్డదిడ్డంగా అనేక ఆటంకాలతో పెరిగే పెట్టుబడిదారీ విధానంవల్లను, జాతీయాభివృద్ధి ఎక్కువ తక్కువ స్థాయిలలో జరిగింది. క్రమేణ ఈ అభివృద్ధి అనేక క్లిష్టసమస్యలకు కారణమైంది. కొన్ని ప్రాంతాలలో పెట్టుబడిదారీ విధానం, ఇతర ప్రాంతాలకంటె వేగంగా అభివృద్ధి చెందింది. సహజంగా అట్టి ప్రాంతాలు సామ్రాజ్య వ్యతిరేక పోరాటాలలో నాయకత్వం వహిస్తూ వచ్చాయి. వివిధ జాతులు వున్న దేశంలో మనం నివసిస్తున్నామని అప్పుడు గ్రహించలేదు. జాతీయోద్యమం క్రమంగా అభివృద్ధిచెందుతూ వచ్చింది. ప్రజా సామాన్యం ముఖ్యంగా రైతాంగం, అన్ని ప్రాంతాలలోను రాజకీయ చైతన్యం పొందారు. ఈసమయంలోనే, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకమైన జాతీయోద్యమంలోనే వేరువేరు భాగాలుగా ప్రత్యేక జాతీయోద్యమాలు బయల్దేరాయి.

## బోల్షివిక్కుల పంథా

ఒకవైపు వివిధ జాతుల ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి వ్యాపించుతూంటే, మరొక వైపు జార్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజా పోరాటాలు వృద్ధి అయి, 1912 – 14 నాటి రష్యాలో యెన్నో ప్రజాస్వామ్య వుద్యమాలు బయల్దేరాయి. ఇవి అన్నీ ఒకదాని కొకటి పరస్పర సంబంధం కలిగియుంటూ వృద్ధినొందాయి. ప్రజా సామాన్యంయొక్క యీ అసంతృప్తిని, ప్రజా స్వామ్య హక్కులకై వారు పొందే ఆతురతను, అవకాశంగా తీసుకొని, బూర్జువావర్గం వాటిని తన స్వలాభానికై ఉపయోగించుకొనసాగింది. ఈ వుద్యమాల్ని యెక్కడికక్కడ చీల్చడానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నాలను భగ్నం గావిస్తూ, జార్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి, బోల్షివిక్ పార్టీ అన్ని జాతుల ప్రజల్ని ఐక్యపరచుటకు కృషిచేసింది. 1912 లో బోల్షివిక్ పార్టీని యెదుర్కొన్న ప్రధాన సమస్య యిదే. వివిధ జాతులు, తమ స్వయం నిర్ణయ హక్కుకై పాటుబడే ప్రయత్నాలలో, ప్రజా స్వామ్య పద్ధతుల్నీ, అభివృద్ధికరమైన లక్షణాల్నీ బోల్షివిక్కులు గుర్తించారు. ఈ స్వయం నిర్ణయ హక్కును అంగీకరించడంవల్లనే బూర్జువావర్గం యొక్క పన్నాగాలను భగ్నం చేయుటకు, జార్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా అన్ని జాతుల ప్రజల్ని సమీకరించుటకు, యిందు కవసరమైన ఐక్యతను వారిలో పెంపొందించడానికి, సాధ్యమవుతుందని వారు గ్రహించారు. రెండు పోకడల మధ్య గల తారతమ్యాన్ని బోల్షివిక్కులు స్పష్టంగా అర్థంచేసుకున్నారు. (1) కొత్త జాతులు చారిత్రికంగా అభివృద్ధికరమైన చైతన్యాన్ని పొందుతూ; జాతీయ స్వయంనిర్ణయ సూత్రంద్వారా పరిపూర్ణమైన వ్యక్తిత్వాన్ని వృద్ధిచేసుకోవడం. (2) ఈ చైతన్యాన్ని బూర్జువావర్గం అవకాశంగా తీసుకొని, తన స్వలాభానికి వినియోగించుకొన ప్రయత్నించడం. స్వయం నిర్ణయ సూత్రాన్ని అంగీకరించడంవల్లనే, బూర్జువావర్గపు పన్నాగాన్ని భగ్నంచేయవచ్చుననీ, విప్లవ పూరితమైన ప్రజా ఐక్యతను నిర్మించవచ్చుననీ, బోల్షివిక్కులు గ్రహించారు.

## మన జాతీయైక్యతా నినాదం

ఇదే విధంగా నేడు మన దేశంలో కూడా జరుగుతోంది. నిద్రాణమైయున్న వివిధ జాతుల ప్రజల్ని జాతీయోద్యమం మేల్కొల్పింది తద్వారా, కొత్త జాతులు స్వతంత్ర జాతీయ పరిపూర్ణతను కాంక్షిస్తున్నాయి. ఈ పరిస్థితులలో, సామ్రాజ్యవాదాన్ని యెదుర్కొంటూ వివిధ జాతుల ప్రజల్ని ఐక్యపరచుట, మన మాతృదేశ విముక్తికై ఫాసిజంతో పోరాడుట మన కర్తవ్యమైయుంది. ఈ విషయం బాగా గ్రహిస్తేనేగాని నేటి ఐక్యతా నినాదంయొక్క ప్రాధాన్యతను మనం గుర్తించలేము.

స్టాలిన్, "బహుశః భారతదేశాంలో కూడా, నిద్రాణమైయున్న అనేకజాతులు పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధితోబాటు మేల్కొంటాయి," అని అన్నాడు. పై విషయాన్ని అర్థం చేసుకుంటేగాని స్టాలిన్ వాక్యంలోవున్న పూర్తి అర్థం మనకు తెలియదు.

దేశంయొక్క నేటి క్లిష్టపరిస్థితులలో, జాతీయైక్యతయొక్క ప్రాధాన్యతను తెలుసుకోవాలంటే పై ముఖ్య సిద్ధాంతాన్ని మనం గుర్తించి తీరాలి. హిందూ - ముస్లిం సమస్య యీ సమస్యలో ఒక భాగం మాత్రమే. నూతన జాతుల వికాసంకూడా ఈ సమస్యలో ఒక భాగం. నిద్రనుండి మేల్కొని, స్వయం వ్యక్తిత్వాన్ని కాంక్షించే వివిధ జాతుల చైతన్యమే యీ మత సమస్య - అను యదార్థాన్ని మనం గుర్తిస్తేగాని, దీనికి సరియైన పరిష్కార మార్గమేదో మనం తెలుసుకోలేము.

ఈసమస్యను కేవలం జడదృష్టితోచూచినా, బోల్షివిక్కు లవలంబించిన పద్ధతులన్నింటినీ తు. చ తప్పకుండా ఆచరణలో పెట్టినా ప్రయోజనముండదు. ఇలా చేస్తే, లాయర్ల వలె, కేవలం చట్ట నిర్మాణ పద్ధతులకు దాసోహం చేయడం అవుతుంది. ఇట్టి అసహ్యకరమైన పద్ధతులు సికందర్ హయత్‌ఖాన్ మొదలైనవారు అవలంబించవలసినవి.

ఈ సమస్యను చట్ట నిర్మాణ పద్ధతులతో పరిష్కరించవచ్చునని వాదించేవారు అసలు విషయాన్ని గుర్తించడంలేదు. సామ్రాజ్యవాదంతో పోరాడటానికి, ఫాసిస్టులనుండి మన దేశాన్ని రక్షించుకోటానికి, ప్రజలలో విప్లవకరమైన ఐక్యత అవసరమను ప్రధాన విషయాన్ని అట్టివారు మరచిపోతున్నారన్నమాట. కాని, కమ్యూనిస్టులమైన మనం, యిట్టి పరిష్కారమార్గానికి వ్యతిరేకులం. సామ్రాజ్యవాదంయొక్క, భూస్వామ్య పద్ధతియొక్క, సంకెళ్ళను ప్రజలు బద్దలుకొడితేనేకాని యే జాతీ స్వేచ్ఛగా అభివృద్ధి చెందలేదను విషయం మన మెరుగుదుము.

ఈ క్రింది విషయాలు, మనకు స్పష్టంగా తెలుసు. వాటిని ప్రజలకు తెలియజేద్దాం.

1. వివిధ జాతుల సమస్యను శాశ్వతంగాను,సర్వతోముఖంగాను పరిష్కరించలంటే, చీలికలకు కారణమైన బూర్జువా విధానాన్ని నాశనంచేసి సోషలిజం స్థాపించాలి.

2. అయినా ఈలోపుగా, బూర్జువా సమాజంలో సహితం,కొంతవరకైనా యీ సమస్యను పరిష్కరించవచ్చును కానిపూర్తియైన ప్రజా స్వామ్య విధానం వున్నప్పుడే యిది సాధ్యపడుతుంది. 1917 లో సోవియటు యూనియను కమ్యూనిస్టు పార్టీ ఇచ్చిన నినాదం కూడా పూర్తియైన ప్రజా స్వామ్యం యేర్పడాలి అని.

బూర్జువా సంస్కరణవాదుల దృష్టిపథంలో లేని విషయం యిదే. రాష్ట్రాల సరిహద్దులను నిర్ణయించడం నేటి సమస్యకాదు. అన్ని తరగతుల ప్రజలను ఒక విప్లవ పంథాను

ఐక్యపరచ గలిగినప్పుడే మన సాంఘిక సమస్య (Communal problem) పరిష్కరించగలమని మనం తెలుసుకోవాలి. ప్రజాస్వామ్య పద్ధతులలో, ప్రజలే తమ రాష్ట్రాల సరిహద్దుల్ని నిర్ణయించుకోవాలంటే, ముందుగా సామ్రాజ్యవాదాన్ని, భూస్వామ్య పద్ధతిని కూలద్రోయాలి.

విప్లవపంథాయైన ఈపరిష్కార మార్గాన్ని నేడుకమ్యూనిస్టులు సూచిస్తున్నారు. మితవాదులు, బూర్జువా సంస్కరణవాదులు, సూచించే మార్గాలకూ దీనికీ హస్తి మశకాంతరం వుంది. వారివలె సరిహద్దుల్ని నిర్ణయించడానికి పూనుకుంటే, పూర్వం ఈ భూమిమాది, ఆ భూమిమీది, అని తర్జనభర్జనలలో నిమగ్నుల మవుతామన్నమాట. దీనివల్ల విప్లవ పంథాకు స్వస్తిచెప్పి బూర్జువా సంస్కరణ వాదంలోకి జారిపోవడం జరుగుతుంది. ఈనాడు మనం పరిష్కరించవలసిన సమస్య, వివిధ జాతులకు పటాలు గీయడం, సరిహద్దులు నిర్ణయించడం, కాదు. నేడు జరిగే స్వాతంత్ర్య పోరాటంలో భారతీయులందరు విజయాన్ని సాధించడమే నేటి సమస్య. ఇందుకు అన్నితరగతుల ప్రజలు విప్లవ చైతన్యంతో ఐక్యతను సాధించేటట్లు చేయడమే మన కర్తవ్యం.

## యదార్థ పరిస్థితులు

తీర్మానంలోని మొదటి పేరాలో ఈ విషయం స్పష్టం చేయబడింది. ఈ సమస్యా పరిష్కారం, కేవలం చట్టనిర్మాణ పద్ధతులతో సాధ్యంకాదనీ, జాతీయోద్యమాన్ని అభివృద్ధి చేస్తూ ప్రజలందర్నీ ఐక్యపరచడమే సరియైన పాలసీ అనీ ఆపేరాలో తెల్పబడింది.

కాని, ఇట్టి సమస్యను పరిష్కరించేటప్పుడు, వూహాజనితమైన భావాలకు మనం తావీయకూడదు. యదార్థ పరిస్థితుల్ని గమనించాలి. కాబట్టి, ఏ యే జాతులు, నేడు ఏ యే కోర్కెలకై వువ్విళ్లూరుతున్నాయో, వాటితో మనం ప్రారంభించవలసివుంటుంది. అఖిలభారత జాతీయ పోరాటాలతో వివిధజాతుల వాంఛలను ఏ విధంగా జతపర్చాలి? ఈ వివిధజాతుల సంచలనంతో అఖిలభారత జాతీయతను ఏవిధంగా వృద్ధిచేయాలి? ఇదే నేటి ప్రధానసమస్య.

ఏ యే జాతుల ప్రజలు ఇప్పుడు, ఇంతకుముందు, ఏ యే విధంగా అణచబడుతూ వచ్చారో, వాటి చారిత్రక రూపాలను, మనం స్పష్టంగా గమనించాలి. ఈ రోజున జమీందారులు, ఇతర భూస్వాములు, గావించే దోపిడీవిధానాన్ని, పూర్వపు దౌర్జన్య పద్ధతుల్ని, దృక్పథంలో వుంచుకోవాలి; ఈ దోపిడీ పద్ధతులన్నీ అంతరిస్తే, ప్రజలెట్టి సౌఖ్యమయమైన జీవితాన్ని గడపవచ్చునో నిరూపించాలి. ఈ నిరూపణద్వారా వారు ఐక్యతతో కార్యాచరణకు పూనుకొనేటట్లు చేయాలి. ఈ జాతులన్నిమంటినీ సమీకరించటమే, స్వాతంత్ర్యంకొరకు ఐక్య కార్యక్రమంతో పనిచేసేటట్లు వారి వారి కోర్కెలను సమన్వయ పర్చడమే, నేటి మన కర్తవ్యం.

ఈ విశాల కార్యక్రమంలో హిందూ-ముస్లిం ఐక్యత ఒక భాగం. మన పరిష్కార మార్గం ఏవిధంగాచిన్నా అనుసరించే పంథాతో సంబంధంలేదో; కాంగ్రెసునాయకుల పంథా నుండి, అఖండ హిందూస్థాన్‌వాదుల పంథానుండి, ఏవిధంగా వేరో మనం స్పష్టంగా తెలియ చేయాలి.

## అపాయకరమైన రెండు పోకడలు

ఇదే సమయంలో మన పంథా అపాయకరమైన రెండు పోకడలను వ్యతిరేకిస్తుంది. (1) హిందూ-ముస్లిం బూర్జువా వర్గాలు ప్రజా సామాన్యాన్ని చీల్చడానికి చేసే ప్రయత్నాలు. జారిస్టు రష్యాలో రష్యనుజాతి రాజ్యాంగాధికారాన్ని చలాయిస్తూ, యితర జాతుల్ని అణగ ద్రొక్కుతూ వుండేది. ఆ యా జాతుల బూర్జువా వర్గాలు దీనిని అవకాశంగా తీసుకొని, రష్యన్ జాతినుండి చీలిపోవలసిందే నను ఆందోళన ప్రారంభించారు. ఈ ప్రయత్నాలు జయప్రదమై వుంటే, జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అభివృద్ధి చెందుతూన్న ప్రజల ఐక్యత విచ్ఛిన్నం అయి వుండేది కార్మిక, కర్షక ప్రజా సామాన్యంలో చీలికలు ఏర్పడి వుండేవి. ఆయా జాతుల బూర్జువావర్గాలకు ప్రజా సామాన్యం బలి అయివుండేది. మెన్షివిక్కులు "రష్యా అంతా ఒకే దేశం కాబట్టి వివిధ జాతుల మధ్యగల విభేదాలను లెక్కజేయ నవసరం లేదు" అనేవారు. ఈ పంథా, ఆచరణలో రష్యను జాతి యితర జాతుల్ని అణచడానికి సహాయభూతమైంది. దేశాన్ని చీల్చడానికి బూర్జువావర్గం పన్నే పన్నాగాలకు మరింత బలం చేకూర్చడమే అయింది. ఈ విధంగా ఆచరణలో మెన్షివిక్కులు రష్యను సామ్రాజ్యవాదానికి యేజంట్లు అయారన్నమాట. జారుప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే ఐక్య పోరాటంలోనుండి, ప్రజాసామాన్యాన్ని దూరం చేయడానికి బూర్జువా వర్గం చేసే ప్రయత్నాలను బలపర్చారన్నమాట. సోషల్ డెమాక్రిటిక్ (కార్మిక) వుద్యమంలో చీలికలు తెచ్చారన్నమాట. వివిధ జాతుల కష్టజీవులు యేకం కాకుండా, ఆటంక పర్చారన్నమాట. చీలిపోవాలి అనే నినాదం ప్రజల స్వాతంత్ర్యానికి దారితీయకుండా, వారి దాస్యం మరింత యెక్కువ కావడానికే వుపయోగపడుతుంది.

ఈ సమయంలో బోల్షివిక్కులు రెండు నినాదాలిచ్చారు. (1) ప్రజలందరికి సంబంధించిన విప్లవ పోరాటానికి ఐక్యత అవసరం. (2) ప్రజాస్వామ్య పరిపాలనగల రష్యాలో అన్ని జాతులు కలిసిన సమ్మేళనం ఉండాలి ప్రతిజాతి స్వయంనిర్ణయ హక్కుతోబాటు విడిపోయే హక్కునుకూడా కలిగియుండాలి. ఈ రెండు నినాదాలను బోల్షివిక్కులు సమన్వయిస్తూ పనిచేశారు. ఈ నినాదాలవల్లనే, ఇటు మెన్షివిక్కులతో పోరాడుటకు, అటు చీలికలు కల్గించాలనిచూచే బూర్జువావాదుల పన్నాగాలను భగ్నం చేయుటకు, అవకాశం ఏర్పడింది.

# శ్రామికవర్గ పార్టీయొక్క కర్తవ్యాలు

మన భారతదేశంలోకూడా, కొద్ది భేదాలతో, పైసోకడలే కనిపడుతున్నాయి. వివిధ జాతులను నేడు అణిచేది సామ్రాజ్యవాదం. కాని, జాతీయోద్యమం అందరిలోను విరివిగ వ్యాపించింది. అయితే, వివిధజాతులు సరిసమానంగా అభివృద్ధి చెందలేదు. కొన్ని జాతులు యితర వాటికంటె ఎక్కువ అభివృద్ధిచెంది ఆధిక్యతను సంపాదించడం, మరికొన్ని జాతులు వెనుకబడి ఉండడం చూస్తున్నాము. ఈ పరిస్థితులవల్ల, జాతీయోద్యమంలో వివిధ మతాల మధ్య అనుమానాలకు, అపోహలకు అవకాశాలేర్పడ్డాయి. తాము హిందువులచే అణచబడు తున్నామని ముస్లిం ప్రజాసామాన్యం భయపడుతోంది. ఈ భయానికి నిజంగా ఆధారం ఉన్నదా ? అనే ప్రశ్నకు జవాబు చెప్పాలంటే, ప్రజలు ఆ విధంగా భావిస్తున్నారా లేదా అని చర్చించడంవల్ల ప్రయోజనముండదు. దేశంలో నేడు జరిగే సంఘటనలను పరిశీలిం చాలి. పెట్టుబడిదారీ విధానం దేశంలో అసమానదశలలో వ్యాపించడంవల్ల స్వతంత్ర భారత దేశంలో, అభివృద్ధిచెందిన ఒకజాతి, వెనుకబడియున్న యితర జాతుల్ని అణచుటకు సమ ర్థతను కలిగియుంటుంది. కాంగ్రెసు మంత్రివర్గాల కాలంలో యిట్టి బీజాలు ఉన్నవని స్పష్టంగా మనం తెలిసికోగలం. కనుకనే యీ భయానికి ఆధారం ఉన్నదని మనం చెబు తున్నాము. (ఉదా:-యు. పి. రాష్ట్రంలో ఉరుదూభాషకు పాఠశాలలో తగిన ప్రాధాన్యత యీయకపోవుట; మధ్య పరగణాలలో విద్యామందిరస్కీము మొదలైనవి ) జాతీయోద్య మంలో శ్రామికవర్గ పార్టీయొక్క కర్తవ్య మేమిటంటే, యీ వాస్తవిక పరిస్థితుల్ని గమ నించాలి. వాటి కనుగుణ్యంగా సంయుక్త జాతీయ ప్రతిఘటనకు ఒక కార్యక్రమాన్ని యీయాలి. స్వతంత్ర భారతదేశంలో, ప్రతిజాతి ప్రజలకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఎలా వుంటుందో చూపుతూ, వివిధజాతులమధ్య ఉండే అనుమానాలను భయాన్ని పోగొట్టాలి.

అసమానమైన దశలలో జరిగే యీఅభివృద్ధి, ప్రజలకు వ్యతిరేకంగా కాకుండా అను కూలంగా ఉపయోగపడేటట్లు మనం పరిస్థితులు కల్పించాలి. సామ్రాజ్యవాదుల ఆటంకాలనూ ఫాసిష్టు హంతకుల దాడినీ యెదుర్కోడానికీ అవసరమైన ఐక్యతను, యీ అసమానత్వం బలహీన పరచేదిగా ఉండకూడదు. బూర్జువావర్గపు పంథా అనైక్యతవైపు తీసుకెడుతుంది. శ్రామికవర్గ పార్టీ పంథా వెనుకబడ్డ జాతుల్ని వేగంగా అభివృద్ధి దశకు తీసుకుపోతుంది. అభివృద్ధిచెందిన జాతు లనుసరించే మార్గాలనే యిందుకు వుపయోగిస్తాము.

శ్రామికవర్గపార్టీ అయిన మన పార్టీ, స్వతంత్ర భారతదేశముయొక్క ప్రజాస్వామ్య స్వరూపాన్ని జాతీయోద్యమంలో స్పష్టీకరిస్తుంది. స్వతంత్ర భారతదేశంలో, ఒకజాతి మరొక జాతిని అణచుటకు వీలుండదని తెలియజేస్తాం. "అఖండ హిందూస్తాన్" అనే నినా దంతో, వెనుకబడ్డ జాతుల్ని అణచిపెట్టే ప్రయత్నా లన్నింటినీ మనం బయట

పెడతాం. వివిధ జాతుల మధ్యగల అసమాన దశలను ఉపయోగించుకుంటూ, పాకిస్తాన్ నినాదానికి ప్రజా బలం సమకూర్చుకొనే ధనికవర్గపు కుట్రను కూడా భగ్నం చేస్తాం. "ముస్లిం దేశాలన్నీ ఒకటి" అనే నినాదంద్వారా ప్రజా సామాన్యంయొక్క మత పిచ్చిని ఆధారంగా తీసుకొని, వారిని స్వాతంత్ర్యోద్యమం నుండి చీలదీయడానికి ధనికవర్గాలు చేసేకుట్రలను భగ్నంచేయడానికే పై విధానం అవలంబిస్తాం.

మొదటి సామ్రాజ్యవాద యుద్ధం ముగిసినవెంటనే, సోవియట్ యూనియన్‌లో కూడా యీవివిధ జాతులసమస్యను పరిష్కరించడంలో, "ముస్లిం దేశాలన్నీ ఒకటి" అనే నినాదంపై చాలా చర్చలు జరిగాయి. బోల్షివిక్కులు యీ వాదనను అంగీకరించలేదు. స్వయం నిర్ణయ హక్కుద్వారా వివిధజాతులు చీలిపోయితీరాలని వాదించినవారిని బోల్షివిక్కులు తీవ్రంగా ఎదుర్కొన్నారు. ఎందువల్లనంటే, యీ నినాదం ఐక్యతా విచ్ఛిన్నానికి తోడ్పడు ఆయుధం. ఎక్కడో వున్న యితర దేశాలకు విధేయత చూపుతూ, జాతీయ స్వాతంత్ర్యం కొరకు జాతీయైక్యత రాకుండా ఆటంకపరచే నినాదం అది. మన దేశంలోకూడా యీ నినాదంలో ఉన్న బండారాన్ని బయటపెట్టాలి. స్వాతంత్ర్య పోరాటానికి వివిధ జాతులమధ్య ఐక్యతయెంత అవసరమో చూపెట్టాలి.

## ముస్లిం ప్రజల కేమని బోధించాలి ?

ముస్లిం ప్రజలలో మనం ప్రచారంచేసేటప్పుడు, పాకిస్థాన్‌ను గురించి వారిలో గల భ్రాంతి పోయేటట్లు చెప్పాలి. వారి జాతీయ చైతన్యాని కనుగుణ్యంగా, దేనిని వారు వాంఛిస్తున్నారో దానిని స్పష్టంగా తెలియచేయాలి. తమ జన్మభూమి (Home land. ఉదా: పశ్చిమ పంజాబు, తూర్పు బెంగాలు, సింధు, బెలూచిస్థాన్)పై వారికిగల భక్తిని గురించి, ఆ భక్తి జాతీయవాంఛ రూపంలో ప్రదర్శింపబడవలసిన అవసరాన్ని గురించి, వారికి తెలియ చెప్పాలి. మనం చెప్పవలసిన పద్ధతి, ముస్లిం ప్రజల్ని గాఢమైన దేశభక్తులుగా తయారు చేసేదిగా ఉండాలి. వారు తమ ప్రాచీన జన్మభూమిలో తమ తోటివారలతో స్వేచ్ఛగా జీవిస్తే ఉండే ఆనందాన్ని తెలియజేయాలి. స్వేచ్ఛగా తమ జన్మభూమిలో, జీవించడమే ముస్లింప్రజల నిజమైన వాంఛ. జాతీయ స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించడంద్వారా, యీవాంఛ యీడేరుతుంది. కేవలం మతరీత్యా పాకిస్థాన్ కావాలని ముస్లిములు కోరరు. నిజమైన వారి జాతీయవాంఛ నెరవేరనంతకాలం పాకిస్థాన్ నినాదమే సరియైనదని వారు విశ్వసిస్తారు. ఈ విశ్వాసం మతకారణాలవల్ల ఏర్పడదు, పాకిస్థాన్ సిద్ధిస్తే, నిజమైన తమ ప్రజాస్వామ్య హక్కులు స్థాపించబడతాయని వారి ఆశ. కాబట్టి వారు కోరే ప్రజాస్వామ్యహక్కులకు నిజమైన అర్థమేదో మనం తెలియచేయాలి,

"ముస్లిందేశాలన్నీ ఒకటి" అనే నినాదానికి భారతదేశంలో యింకా స్థానంఏర్పడలేదు. 1931-32 నాటినుండి పాకిస్థాన్ భావం ముస్లిం విద్యార్థికులలో వ్యాపించింది. కాని, యిది ఖండితమైన ఒక దశకు అభివృద్ధి అయేవరకు ప్రచారం కాలేదు. యుద్ధం ప్రారంభమై, బ్రిటిష్ ప్రభుత్వాన్ని, యుద్ధాశయా లేమిటని, కాంగ్రెసు అడిగినపుడు ఈ పాకిస్థాన్ నినాదం బైటకు వచ్చింది. స్వాతంత్ర్యం తమకు త్వరలోనే లభ్యం కాబోతున్న దని ప్రజాసామాన్యమంతా ఆశించే సమయంలోనే పాకిస్థాన్ నినాదం బహిరంగంగా ప్రచారం కావడం ప్రారంభమైంది.

## లీగ్ నాయకుల పలుకుబడి

మరొక విషయాన్ని కూడా మనం గుర్తించాలి. ముస్లిం ప్రజాసామాన్యంలో జిన్నా యొక్క, లీగ్ నాయకులయొక్క పలుకుబడి హెచ్చుతూంది. అనేక రాష్ట్రాలలో లీగ్ బలపడింది. ఈ పరిస్థితులలో, మార్చి 1940 లో, జిన్నా పాకిస్థాన్ నినాదాన్ని బయలుదేరదీశాడు. ప్రపంచ పరిస్థితులకు, ఈ నినాదానికీ, ఎట్టి సంబంధమున్నదో మొదట మనం గుర్తించాలి. భారతదేశమంతటా ప్రజాచైతన్యం వ్యాపించింది. అట్టి సమయంలో ఈ నినాదం వట్టి దబాయింపు అనుకోవడం పొరపాటు. సామ్రాజ్యవాదంనుండి అధికారం లాగుకొనే నిమిత్త, ఒకవైపు కాంగ్రెసు సహాయనిరాకరణను ఆయుధంగా ఉపయోగిస్తే, రెండోవైపు, ముస్లిం ప్రజాసామాన్యంయొక్క యుద్ధవ్యతిరేకతను గ్రహించిన ముస్లింలీగ్ కూడ, అధికారానికై రాజాకీయపు ఎత్తు వేసింది. అధికారాన్ని పంచుకోవడానికి ముస్లింలీగ్, కాంగ్రెసు వేసినయెత్తుకు పోటీగా, మరొక నినాదాన్ని బయలుదేరదీసింది. యుద్ధ వ్యతిరేకులైన ముస్లిం ప్రజాసామాన్యం, యీ నినాదంద్వారా జిన్నాకు బలమిస్తున్నారు. అన్నిటికంటె ముఖ్యమైన విషయం ఏమంటే, నానాటికి అభివృద్ధి చెందుతూ, బలపడుతూన్న ముస్లింజాతుల ప్రజల్ని, "ఇది మన జన్మభూమి, అది మన జన్మభూమి," మొదలైన నినాదాలద్వారా ముస్లింలీగ్ ఆకర్షించి, తన స్వార్థానికి వినియోగించుకొంటూంది.

పై విధంగా మనం పాకిస్తాన్ నినాదాన్ని అర్థం చేసుకోవాలి. ఇందులోవున్న ముఖ్య విషయాన్ని, ముస్లిం ప్రజలు నేడు కోరే కోర్కెను, అనగా జాతీయ స్వయంవికాసానికి వారు కోరే అవకాశాలను, మనం మరచిపోతే యదార్థ పరిస్థితుల్ని అర్థంచేసుకోవడంలేదన్నమాట దీన్ని మనం గ్రహించకపోతే భారతీయు లందరి నాశనానికి తోవ తీసినవారమౌతాం.

## అజాద్ ముస్లిం కాన్ఫరెన్సు

1940 మార్చిలో అజాద్ ముస్లిం కాన్ఫరెన్సు, ఢిల్లీలో జరిగింది. ఆ సమయానికి మనం పరిస్థితులలో యేర్పడిన మార్పును గ్రహించాము. వివిధ జాతుల స్వయం నిర్ణయ హక్కును గుర్తించవలసిన సమయం ఆసన్నమైనదని తెలుసుకొన్నాం. పాకిస్తాన్ నినా

దాన్ని జాతీయ స్వయం నిర్ణయ సూత్రంతోనే యెదుర్కోవాలి: ఇదే సంపూర్ణమైన ప్రజా స్వామ్య నినాదం; ఈ విధంగా మాత్రమే స్వాతంత్ర్య సంపాదనకై హిందూ-ముస్లిం ఐక్యతను సాధించగల్గుతాం; అనే యదార్థాన్ని మనం తెలుసుకొన్నాం.

కొద్దికాలంతరువాత, 1940 డిసెంబరులో, అఖిలభారత విద్యార్థి ఫెడరేషను నాగపూరులో సమావేశమయింది. ఆ సమావేశంలో మన కమ్యూనిష్టు విద్యార్థులు సరియైన ఒక పాలసీని యివ్వ ప్రయత్నించారు. కాని అనేక సమస్యలన్ను కలగాపులగంచేసి, తికమకలు కలిగించారు పార్టీ యీ తప్పుల్ని సరిదిద్దవలసి వచ్చింది.

## పొలిట్ బ్యూరో యొక్క లోపం

కాని, అప్పటినుండి, ఈ సమస్యనుగురించి సాకల్యంగా తెలియపరచే ఒక కరపత్రాన్నిగూడా పొలిట్‌బ్యూరో ప్రకటించ లేకపోయింది 1941 ఏప్రియల్‌లో పార్టీ లేఖ ఒకటి ప్రచురించబడింది. కాని అదిమాత్రమే చాలదు. యీనాడు మన దేశ భవిష్యత్తు, మన ప్రజల క్షేమం, జాతీయ ఐక్యతమీద, కాంగ్రెసు-లీగ్ ఐక్యతమీద, ఆధారపడి వున్నాయి. ఈ సమస్యను యిక వాయిదా వేయలేము. సమస్యా పరిష్కారానికి ఎంతమాత్రం ఆలస్యం కూడదు స్వాతంత్ర్యమా ? లేక పాసిస్టు దాస్యమా ? అనేవి రెండే మన యెదుట కనబడుతున్నాయి. ఏది లభించేదీ, మనం జాతీయ ఐక్యతకై చేసే కృషిమీదనే ఆధారపడి ఉంటుంది. జాతీయ నాయకత్వంలో కొందరు యీ సమస్యయొక్క ప్రాముఖ్యతను గుర్తించారు. అలహాబాదులో ముందడుగువేసి, జాతీయైక్యతయొక్క ప్రాముఖ్యతను గ్రహించిన నాయకులలో ప్రథముడు రాజాజీ.

## పార్టీ సభ్యులలో గందరగోళం

అయినా, పాకిస్థాన్‌నుగూర్చి, దాన్ని అర్థంచేసుకోవడంలోనూ, పార్టీ సభ్యులలోనే కావలసినంత గందరగోళం ఉంది. "జిన్నా కోరేదేదో యిచ్చివేదాము" అనే వాదన సంతృప్తి విధానం (appeasement) ఇది బూర్జువా సంస్కరణ పద్ధతి. ఇట్టి పంథాకు కారణం, ఉభయపక్షాలలోని బడానాయకుల ఐక్యతే జాతీయ ఐక్యత అని భ్రమపడడం. ఈ విధంగా ఆలోచించేవారు, హిందూ-ముస్లిం ప్రజాసామాన్యంలో బలీయమైన ఐక్యతను సాధించాలని కోరరు. ఐక్యత అంటే శక్తితోకూడిన ఒక ప్రజాఉద్యమమని తెలుసుకోరు. రాజాజీ వంటివారు, ఐక్యత కుదరడం అసంభవమని భావించడానికి కారణం యీ వాదనే. కొద్దిమంది పెద్దల మంచితనంమీద ఆధారపడి ఐక్యత నిర్మించబడుతుందనే సిద్ధాంతం నిరుత్సాహానికి, అపజయభీతికి దారి తీస్తుంది. "జిన్నాకు కావలసింది యిచ్చివేదాం" అనే పరిష్కార మార్గం తప్పు. ముస్లిం ప్రజలకు న్యాయమైన ప్రజాస్వామ్య హక్కులు అవసరం. అవి యివ్వడానికి మనం మార్గాలు వెతకాలి. ఈ పునాదులమీద జాతీయ ప్రభుత్వాన్ని నిర్మించుటకు,

భారతీయులందరి మాతృదేశాన్ని రక్షించుటకు, అభేద్యమైన హిందూ-ముస్లిం ఐక్యతను మనం సాధించాలి.

## హిందూ మహమ్మదీయులలో ప్రచార పద్ధతి

ముస్లింలలో మనం ప్రచారం చేసేటప్పుడు, వారు పాకిస్థాన్‌ను ఎందుకు కోరుతున్నారో, ఆ కోర్కెలో నిజమైన ప్రజాస్వామ్య హక్కులేవో, స్పష్టంగా అర్థమయేలాగు, వారి దృష్టి పథానికి తేవాలి. వివిధజాతుల స్వయంనిర్ణయ హక్కుద్వారా వారి ఆశయము నెరవేరుతుందని మనం స్పష్టం [illegible]యాలి.

కాని, హిందువులలో ప్రచారంచేసేటప్పుడు మరొక విధంగా బోధించాలి. కాంగ్రెసు అభిమానం గల హిందువులలో, అనేక సంవత్సరాల జాతీయోద్యమం యొక్క అనుభవం ఉంది. వారికి మనం నచ్చచెప్పవలసిన విషయమేమంటే, అన్నిజాతులకు స్వయంనిర్ణయ హక్కును గుర్తించడంవల్ల ఐక్యత తప్పక వస్తుంది. భారతదేశం అనేక జాతుల సమ్మేళనం అనే యధార్థం వారికి తెలియదనే విషయాన్ని మనం మరచిపోగూడదు. దీన్నిగురించి వారికి ఓపికతో నచ్చచెప్పడంవల్లనే, వారిని అభివృద్ధి నిరోధకులైన హిందూనాయకుల పలుకుబడి నుండి తప్పించగల్గుతాం. ఈ అభివృద్ధి నిరోధక శక్తులకు నేడు మన జాతీయోద్యమంలో ఎక్కువ పలుకుబడి లేదు వారిని ప్రజలనుండి వేరుచేయాలంటే, హిందువులు-మహమ్మదీయులు పరస్పర విరుద్ధమైన ప్రకృతిని కలిగియుంటారనే దురభిప్రాయాన్ని మనం ఎదుర్కోవాలి. ఉదా: "పాకిస్థాన్" అనే పుస్తకంలో అంబేద్కరు, హిందూ మహమ్మదీయులు ప్రకృతిలోనే పరస్పర భిన్నభావాలు కలిగియుంటారని, వారెన్నడూ ఏకంకాలేరని, వ్రాశాడు. కాబట్టి కాంగ్రెసు అభిమానంగల హిందువులతో మనం మాట్లాడేటప్పుడు, భారతదేశం ఏవిధంగా వివిధజాతుల సమ్మేళనమో స్పష్టపరచాలి. దేశంలో అట్టి నిర్మాణం ఏర్పడినప్పుడే యీ సమస్యలను సంతృప్తికరంగాను, శాశ్వతంగాను, పరిష్కరించగల్గుతామని బోధించాలి. అంబేద్కరువంటివారి కుతర్కాలను ఎదుర్కోవడానికికూడా యిదే సరియైనమార్గం. హిందూ ప్రజలకు సరిగా నచ్చచెప్పగల పద్ధతి యిదే. "భారత దేశమంతా ఏక ఖండం, ఒకేజాతి" అనే భావం వారిలో ఏర్పడింది. ఇందుకు కారణం జాతీయోద్యమంలో వారు తీవ్రంగా పాల్గొనడం. కాబట్టి, వారిలో మనం ప్రచారం చేసేటప్పుడు, దేశాన్ని ముక్కలుగాచీల్చడం ఎలాగు మన పంథా కాదో చూపెట్టాలి. మనం సూచించే పరిష్కారమార్గమే అభేద్యమైన ఐక్యతను యెలా చేకూర్చగలదో స్పష్టం చేయాలి. వారి ఆశయం ఐక్యత. వారి రాజకీయ చైతన్యంకూడా యెక్కువ. కాబట్టి, వారికి, మన పరిష్కారమార్గమే ఏవిధంగా యిప్పటికంటే ఉన్నతమైన ఐక్యతకు దారి తీస్తుందో, తెలియచేయాలి. అప్పుడే వారు మన పంథాను ఒప్పుకోగల్గుతారు. ఈవిధంగా మనం "అఖండ హిందుస్థాన్ వాలా"లను ప్రజాసామాన్యం నుండి వేరు చేయగల్గుతాం.

# భూగోళ శాస్త్రం మధించ నవసరంలేదు

ఈ సమస్య యే విధంగా ఉదయిస్తున్నదో, ఆ ప్రత్యక్షరూపాన్ని మనం చూపెడతాం. భూగోళశాస్త్రాన్ని మధించవలసిన అవసరం యిప్పుడులేదు. రాజకీయంగా యిది అనవసరం. ఆచరణలో యిది సాధ్యం కాదుకూడా. కాని కొన్ని ప్రధాన సూత్రాలను తప్పకుండా వివరించవలసి వుంటుంది. మన పరిష్కారమార్గం ముస్లిం ప్రజల న్యాయమైన కోర్కెను ఎంత వరకు సిద్ధింపచేస్తుందో, పాకిస్తాన్ నినాదంలోవున్న అభివృద్ధికరమగు పోకడను యెంత వరకు బలపరుస్తుందో, గమనించాలి ఐక్యతకై ముస్లిం ప్రజల్ని మోసం చేయడం మనపని కాదు. వారి న్యాయమైన కోర్కెకు మూలం యేమిటో, దాన్ని కనుక్కోవడం మన కర్తవ్యం.

వాద ప్రతివాదాలకు అవకాశమిచ్చే భూగోళ పటాలను గీయడం మన పనికాదు "సమ్మోహనాస్త్రం"తో ముస్లిం ప్రజల్ని దగాచేయడం అసలేకాదు.

బెలూచిస్తాన్‌లోనూ, కలాలీట్ సంస్థానంలోనూ, ప్రజలలో నూటికి 98, 99 మంది బెలూచిభాషను మాట్లాడే మహమ్మదీయులు. వీరి విషయంలో ప్రత్యేక జాతిని నిర్ణయించడం కష్టంకాదు. తగాదాలు రాకుండా, సులభంగా నిర్ణయించవచ్చు. ఇక పఠానుల విషయం: వీరందరూ ముస్లింలు. సరిహద్దురాష్ట్రంలోని జనాభాలో వీరు 100 కి 90 మందికి పైగా వున్నారు. వీరు జిన్నా పలుకుబడిలో లేరు. అయినప్పటికి, పాకిస్తాన్ నినాదాన్ని ముస్లింలీగ్ బయలు దేరదీసినపుడు, అచ్చటి జాతీయ నాయకులు పఠానుల జాతీయ స్వయం నిర్ణయ హక్కును గుర్తించి, పాకిస్తాన్ నినాదాన్ని యెదుర్కోవడానికి అదే సరియైన మార్గమని తలచారు అలహాబాదు అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో పఠాన్ ప్రతినిధులు రాజాజీ తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేయలేదు. కాని, మితవాద నాయకులు తమను బలవంతపెట్టు తారనే ఉద్దేశంతో వారు సభను విడిచి బయటకు వెళ్ళిపోయారు మనం తెలిపిన పరిష్కారాన్ని వారు బాగా మెచ్చుకున్నారు. మనపంథా సరియైనదేనని వారి భావాలవల్ల రుజువైంది.

పంజాబుయొక్క పడమటి జిల్లాలలో నూటికి 60 మందికి పైగా ముస్లింలు. చాలా ప్రాంతాలలో 100 కి 70, 80 కంటె ఎక్కువగాకూడా ఉన్నారు. కాని సంఖ్యాధిక్యత ఒక్కటేకాదు కావలసినది. ఆ ప్రాంతాలలో ప్రజలు జీవితం ఏ యే ప్రత్యేక లక్షణాలతో కూడియున్నదోచూడాలి. సట్లెజ్‌నదికి పడమటనున్న జిల్లాలో ప్రజలు ప్రత్యేకమైన భాషను సంస్కృతిని, కలిగియుండి ఒకే నిర్ణీత ప్రదేశంలో నివసిస్తూ ప్రత్యేక జాతులకుండవలసిన లక్షణాలన్నీ కలిగియున్నారు. సట్లెజ్‌కి తూర్పుననున్న జిల్లాలలో ముస్లింలు తక్కువ సంఖ్యలో అక్కడక్కడ, చెదరివున్నారు. తమకు ప్రత్యేక పాఠశాలలు, విజ్ఞానాభివృద్ధికి అవకాశాలు, కావాలని కోరుతారు. ఈ హక్కులు వారికి తప్పక యివ్వబడాలి.

ఇక సింధురాష్ట్రం సంగతి. ఇక్కడ ఒక కొత్త ప్రశ్న వస్తుంది. సింధురాష్ట్రంలో ఉన్న ముస్లింలు మాత్రమే ప్రత్యేక జాతియా, లేక సింధు ప్రజలందరు ఒక ప్రత్యేక జాతియా? సింధు ప్రజలందరు ఒక జాతియని నా ఉద్దేశ్యం. స్వయంనిర్ణయ హక్కును గుర్తించడంవల్ల సింధు ముస్లింలు సంతృప్తి చెందుతారు. "విడిపోయే హక్కునుగూర్చి ప్రజలందరి వోట్లు తీసుకోబడతాయనుకోండి అప్పుడు సింధువాసులందరు ఓటు చేయాలా, లేక సింధు ముస్లింలు మాత్రమే ఓటు చేయాలా?" అని కొందరు అడగవచ్చు. దీనికి సమాధానమేమంటే, ఈ విషయాన్ని రాయబారాలద్వారా పరిష్కారం చేయవచ్చు. ఈ సమస్య ఈనాడు ఉదయించదు ఉద్యమం ఏ విధంగా బయలుదేరుతుందో, ఏ విధంగా అది అభివృద్ధి చెందుతుందో, అనే వాటిపై ఇది ఆధారపడి ఉంటుంది. మన పరిష్కార మార్గం కేవలం చట్టర్మాణ పద్ధతికాదు. సింధువాసులకు ఈ రోజున స్వయంనిర్ణయ హక్కును యివ్వడంద్వారా ఐక్యతా సమస్యను, ఐక్య పోరాట సమస్యను, పరిష్కరించ గల్గుతాం.

ఇక బెంగాల్ సమస్య. బెంగాలీ ప్రజలంతా ఒకేజాతి అని మనం మొదట భావించాము వారందరికి స్వయంనిర్ణయ హక్కును ఈయాలన్నాం. కాని బెంగాల్‌లో తూర్పు ఉత్తర జిల్లాల సమస్య బయలుదేరింది. ఈ ప్రాంతాలలో సామాన్యంగా 100 కి 60 మందికి పైగా ముస్లిం ప్రజలున్నారు. ఒక విధంగా బెంగాలీలంతా ఒకే జాతి. వారందరికి ప్రత్యేక రాజ్యాంగపు హక్కు వుండాలి. వాస్తవానికి బెంగాల్ ముస్లింలకు, పఠాన్ ముస్లింలకు ఉన్న పోలికలకంటె, బెంగాల్ హిందువులకు, బెంగాల్ ముస్లింలకు ఉన్న పోలికలు ఎక్కువ. కాని తూర్పు బెంగాల్‌లో ఉన్న ముస్లిం రైతాంగం ప్రత్యేకమైన విజ్ఞానాన్ని కలిగియుండి, తూర్పు బెంగాల్ అంతా ఒక ప్రత్యేక జాతిగా కనబడుతూంది. ఇట్టి సందర్భాలలో ఖచ్చితమైన ఎట్టి నిర్ణయాలకు మనం రాజాలం. ఒక్కొక్క జాతి కొన్ని ప్రత్యేక లక్షణాలు మాత్రమే కలిగియుండి, యితరవాటిని క్రమంగా పొందుతూ, అభివృద్ధి చెందుతుంది. మొత్తంమీద యీ సమస్యలో మనం గమనించవలసిన ప్రధాన విషయమేమంటే, తూర్పు బెంగాలులో నేడు అణచబడుతూన్న ముస్లిం రైతాంగాన్ని, యితర ప్రజలతోబాటు, ఏ విధంగా జాతీయ పోరాటంలోకి తీసుకురావాలి? మన తీర్మానంలో సూచించిన ప్రకారం, తూర్పు బెంగాల్‌లోని ముస్లిం ప్రజలు బెంగాల్ అంతటియొక్క విజ్ఞాన సాంప్రదాయాలవల్ల లాభాన్ని పొందుతూ, వాటిని అభివృద్ధి చేయగల్గుతారు. మరొకవైపు, వారందరినీ ఐక్యపరచి, ఐక్య బెంగాలీ రాష్ట్రంలోచేరి ఉండడం వల్ల వారికి వచ్చే లాభాలను వివరించడానికి అవకాశం ఉంటుంది. ఈ విధానంవల్ల వారి కోర్కెలన్నీ ఈడేరుతాయి. పైగా ముందు ముందు వారు బెంగాల్ రాజ్యాంగంలో చేరడానికి మార్గం సులభమవుతుంది. "చీలిపోవా"లని వాదించేవారిని యీ పరిష్కారమార్గంవల్ల మనం ప్రజలనుండిదూరం చేయగల్గుతాం. ప్రజలను విప్లవమార్గాన నడిపించడానికి కూడా సాధనం యిదే.

టప్పుడు, అవి స్వతంత్ర భారత దేశంలో స్వేచ్ఛగాను, సంపూర్ణంగాను, వికసించడానికి, సోషలిస్టు విధానం స్థాపించబడడానికి అనుగుణ్యంగా వుండాలి.

విడిపోయేటప్పుడు ఏపద్ధతిలో? ఎప్పుడు? విడిపోవాలా, అక్కర్లేదా? అనే ప్రశ్నలకు నేడే జవాబు ఈయడానికి వీలులేదు. అది పనికిరాదు కూడా. విడిపోయే హక్కును అంగీకరించడమంటే, తప్పకుండా విడిపోవాలను భ్రాంతిలో మనంపడకూడదు. సమాజంయొక్క అభివృద్ధి వివిధదశలలో జరుగుతుంది కొన్నిదశలలో విడిపోవలసిన అవసరం కలుగవచ్చు. కాబట్టి, ఈ హక్కును గుర్తించడమంటే, విడిపోవడమనే అర్థంకాదు.

దేశరక్షణకు, స్వాతంత్ర్యానికి, అన్ని జాతుల్నీ ఐక్యపరచడమే నేడు మన ప్రధానాశయం. ఈ రోజున ముస్లిం ప్రజలందరినీ ఐక్యపరచుటకు, వెంటనే విడిపోవాలని వాదించే వారిని దూరంచేయుటకు, సరియైన ఆయుధాన్ని కనుగొనడమే నేడు మన కర్తవ్యం. సంయుక్త స్వతంత్ర భారతదేశంలో వివిధజాతులన్నీ సంపూర్ణ వికాసం పొందేటట్లు మనం జాతుల్ని నిర్వచించాలి. మన పాలసీని ప్రత్యక్షంగా ఆచరణలో పెట్టునప్పుడు ఈ రెండు విషయాలు ప్రధానాంశాలని తెలుసుకొనగల్గుతాం.

---

## అల్ప సంఖ్యాక ముస్లింలు

ష్ట్రాలలో అక్కడక్కడ చెదరి ఉన్న అల్పసంఖ్యాక ముస్లింలసంగతి.
మతానికి భాషకు, విజ్ఞానానికి, సాంప్రదాయాలకు, రక్షణ కావాలని
గ్రెసు మ త్రివర్గాలహయాంలో యు. పి. రాష్ట్రంలో ఈహక్కుల
జరిగి ది. ఈ హక్కుల సాకుతోనే ముస్లిం లీగ్ కాంగ్రెసుకు
నే తర్జన భర్జ వించింది. అవి ముస్లిం ప్రజలందరూ కోరే ఖచ్చితమైన
గా ఆందోళన గ ల్పస ఖ్యాకుల సమస్య, కేవలం మత విషయాలకు మాత్రమే
ు. ఈవిధంగా అ రంగానికి కూడా వ్యాపించింది. కనుకనే, మతం, భాష, సాంప్ర
యుండక, రాజకీయ న వాటికి తగిన హామీ యీయవలసి ఉంటుంది.
విజ్ఞానం, మొద ల సమస్యను వివరించడం యిప్పుడు సాధ పడదు. సాధా
వి గాక యితర జా వివరించబడ్డాయి. అవి తీర్మానంలో కూడా పొందుపరచబడి
త్రాలు మాత్రమే పైన
ు.

## హెచ్చరిక

మరొక పర్యాయం ఒక ప్రధాన విషయాన్ని నొక్కి చెప్ప
న్ని ముగించకము దు యొక్క మూలసూత్రాన్ని మనం అర్థం చేసుకోవాలి.
ది. కమ్యూనిస్టు వ ాతుల స్వయం నిర్ణయ హక్కును విప్లవ రాజకీయ సమస్యగా
చూడాలిగాని, చట్ట నిర్మాణ పద్ధతిక సంబంధించిన తగాదాగా చూడకూడదు:
చట్ట నిర్మాణ పద్ధతులకు ప్రాధాన్యత యిచ్చి వాదించేవారి మొదటి ప్రశ్న. "విడిపోవాలా ?
అక్కరలేదా ?" అనేది. కాని, కమ్యూనిస్టులు యిలా ప్రశ్నించరు. ఎట్టి షరతులు లేని
జాతీయ స్వయం నిర్ణయ హక్కు గుర్తించబడి నపుడే ప్రజలందరికి సంపూర్ణాధికారం,
సమానహోదా,లభించడానికి మార్గంయేర్పడుతుంది. ఈసమస్యను మన క్రిందివిధంగా పరిష్క
రిస్తాము : వివిధ జాతులు స్వేచ్ఛగాను, సంపూర్ణంగా ను వికసించాలంటే అందు కవసర
మైన పరిస్థితుల్ని కల్పించాలి. పరిస్థితుల కనుగుణ్యంగా వేరు-వేరు జాతులను నిర్వచించాలి.
ముఖ్యమైన రెండు సంగతులను మనం దృష్టిలో వుంచుకోవా . (1) విడిపోయే హక్కు;
(2) ఐక్యతయొక్క ఉద్దేశ్యం. ఈ రెండూ ఒకదానితో ఒకటి సంబంధం కలిగివుంటాయి.
మన పరిష్కార మార్గం చలన రహితమైనదికాదు. సోవియట్ యూనియన్‌లో
కూడా విప్లవానంతరం మాత్రమే కొన్ని జాతులు సంపూర్ణ వికాసా పొందాయి. కాబట్టి
(1) విడిపోయే హక్కును అంగీకరించడంవల్ల అనుమానాలన్నీ తొ గిపోయి, వెను
వెంటనే ఐక్యత సాధ్యమౌతుంది; (2) వివిధ జాతులకు మనం స్వరూప ర్యం చేసే

# ప్రజాశక్తి ప్రచురణాలు

| | |
|---|---|
| * మన లెనిన్ | 0—6—0 |
| ఫాసిస్టు వ్యతిరేక గీతాలు | 0—6—0 |
| దేశభక్తులు | 0—8—0 |
| * నాజీ శ్రేణుల వెనుక | 0—8—0 |
| * గెరిల్లా | 0—6—0 |
| చైనా గెరిల్లా యోధులు | 0—5—0 |
| * జోసెఫ్ స్టాలిన్ | 0—4—0 |
| పాకిస్థాన్ రిపోర్టు | 0—6—0 |
| ఆహారసమస్య | 0—4—0 |

* అయిపోయాయి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B170 |
| పుస్తకం పేరు | పాకిస్థాన్ జాతుల స్వయం నిర్ణయ హక్కు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |